శ్రీమతే రామానుజాయ నమః
శ్రీమద్వరవరమునయే నమః



# శ్రీరామాయణంలో విశిష్టాద్వైతం

ఏరికాత్తరామర్, మధురాంతకం



'పండితరత్న'

డా|| ఉ. వే. శ్రీమాన్ ఈయుణ్ణి అழగ శింగరాచార్యులు

శ్రీ రామచంద్రపరబ్రహ్మణే నమః

శ్రీమన్నాథమునీంద్రముఖ్యమహనీయాచార్యవర్యోదితాః
శ్రీరామాయణరమ్యకావ్యవిదితాః వేదాంతయుగ్మానుగాః,
స్వారస్యే సహసా  జితామృతరసాః  నైకే మహార్థాః భృశం
సారాసారవివేకినాం ప్రజనయంత్యానందధుం నిస్తులమ్.

శ్రీమచ్ఛ్రీశైలపూర్ణాభిధగురుచరణైః వేంకటాద్రే రుపాంతే
యే ౽ ర్థాః అష్టాదశ శ్రీయతికులపతయే ప్రీతిపూర్వం ప్రదత్తాః,
యే చ శ్రీకృష్ణసూరిప్రముఖగురువరైః వ్యాకృతా స్తే ౽ పి సర్వే
వ్యాఖ్యాంతి శ్రీయతీశప్రథితసుమతసంసిద్ధతత్త్వాని సమ్యక్.

శ్రీరామాయణవారిధౌ ప్రవిలసత్ శ్రీసంప్రదాయోదిత–
జ్ఞాతవ్యార్థమహార్ఘరత్ననిచయేషూద్ధృత్య కాంశ్చిన్మయా,
అత్యంతాల్పధియా కృతో ౽ త్ర  గదితుం తాన్ చాపలాత్ యో, బుధాః!
యత్న,  స్తం క్షమయా సదా పరమయా పశ్యంత్వితి ప్రార్థయే.

లేఖస్యాస్య వినిర్మాణే హేతుభూతేభ్య అర్ప్యతే
కార్తజ్ఞ్యం కృష్ణమాచార్యవర్యేభ్యో2నేకశో మయా.

★★★★★

శ్రీ రామచంద్రపరబ్రహ్మణే నమః

# శ్రీరామాయణంలో విశిష్టాద్వైతం

భారతీయులందరికీ ప్రథమ ప్రమాణం వేదం. వైదిక సిద్ధాంతాలు అన్నీ ఈ వేదాన్ని ప్రమాణంగా చేసుకొని ప్రవర్తించాయి. అద్వైతం, ద్వైతం, విశిష్టాద్వైతం – అని ఈ విధంగా విభిన్నంగా ఉండే వైదిక సిద్ధాంతాలకు అన్నిటికీ మూలం వేదమే. ఈ సిద్ధాంతాలు అన్నిటిలోనూ "తత్వజ్ఞానాత్ మోక్షః, అజ్ఞానాత్ సంసారః" (తత్వజ్ఞానం వల్ల మోక్షం కలుగుతుంది, ఆ జ్ఞానం లేనందు వల్ల సంసారం ఏర్పడుతుంది) అనే క్రమంలో ఏ విధమైన అభిప్రాయ భేదం లేదు కానీ, తత్త్వస్వరూపంలో మాత్రమే అభిప్రాయ భేదాలు ఉన్నాయి. అయితే భిన్న భిన్న సిద్ధాంతాలకు చెందినవారు అందరూ కూడా, తమ సిద్ధాంత తత్త్వాలను నిరూపించే క్రమంలో మొదటి ప్రమాణంగా వేదాన్నే చూపుతారు. ఈ విషయంలో కూడా తేడా లేదు. వేదవాక్యాలను అందరూ ప్రమాణంగా గ్రహించినప్పటికీ ఆ వాక్యాలకు అర్థాన్ని చెప్పే క్రమంలోనే మళ్లీ తేడా ఉన్నది. వేదవాక్యాలకు అర్థం చెప్పే క్రమంలోని ఈ తేడా వల్లనే సిద్ధాంతాలలో భిన్నత్వం కూడా ఏర్పడింది.

వేదజాతం అంతా భగవంతుని గూర్చియే తెలుపుతున్నది. "వేదైశ్చ సర్వై రహ మేవ వేద్యః" (వేదాలన్నిటిచేత తెలియబడేవాడను నేనే) అని గీతాచార్యుడు స్వయంగా భగవద్గీతలో అన్నాడు. ఈ వేదం, పూర్వభాగం అని, ఉత్తరభాగం అని, రెండు విధాలుగా విభాగించబడుతున్నది. పూర్వభాగంలో, భగవంతుని ఆరాధనాక్రమం నిరూపింపబడింది. ఉత్తరభాగం అనబడే వేదాంతంలో ఆరాధ్యుడైన భగవంతుని స్వరూపం నిశ్చయించి తెలుపబడింది.

"అనంతా వై వేదాః" అని, వేదాలు అనంతాలు అయినందువల్ల, వాటిని అన్నిటినీ తన జీవితకాలంలో అధ్యయనం చేసి, వాటిలో ప్రతిపాదింపబడిన అర్థాలను, అందులోని తత్త్వాలను పూర్తిగా

గ్రహించగల్గడం అనేది ఏ వ్యక్తికైనా, అతడు వేదం చెప్పినట్లు నూరు సంవత్సరాల కాలం జీవించగలిగినా, అతడు ఎంతటి ప్రతిభావిశేషాన్ని కలిగినవాడైనా, అసాధ్యమైన పని. అందువల్ల, వేదాలను లోకంలో ప్రవర్తింపజేసిన కరుణాళువు అయిన భగవానుడు వేదపురుషుని హృదయాన్ని పరిపూర్ణంగా గ్రహించగలిగినవారు, విశాలహృదయులు, ఆ వేదాలలోని తత్త్వాలను అందరూ సులభంగా ఆకళింపు చేసుకోవడానికి వీలైన రీతిలో ఋజువుగా వ్యక్తం చేయగలిగినవారు అయిన మహర్షులను, ఆళ్వారులను, పలువురు పూర్వాచార్యులను ఈ లోకంలో ఆ యా కాలాలలో, ఆయా ప్రదేశాలలో అవతరింపజేసి, స్మృతీతిహాస పురాణాలను ద్రావిడవేదాలుగా పరిగణింపబడే దివ్యప్రబంధాలను, రహస్యగ్రంథాలు మొదలైనవానిని వారి ద్వారా ఆవిష్కరింప చేశాడు.

భగవంతుని ఆరాధనాస్వరూపాన్ని తెలుసుకోవడంలో స్మృతులు సహాయపడుతున్నాయి. మనుస్మృతి, పరాశరస్మృతి యాజ్ఞవల్క్యస్మృతి, దక్షస్మృతి, కణ్వస్మృతి, అని ఈ విధంగా పలువురు మహర్షులు అనుగ్రహించిన స్మృతులు అనేకం ఉన్నాయి. ఈ స్మృతులన్నీటిలోనూ, "యద్వై కించిన్మనురవదత్, తద్భేషజమ్" అని చెప్పినట్లుగా మనుస్మృతికి ప్రాధాన్యం అంగీకరింపబడింది.

**"ఇతిహాసపురాణాభ్యాం వేదం సముపబృంహయేత్,**
**బిభేత్యల్పశ్రుతాద్వేదో మామయం ప్రతరిష్యతి"**

(ఇతిహాసాలు అయిన శ్రీరామాయణ, మహాభారతాల సహాయంతో, శ్రీవిష్ణుపురాణం శ్రీభాగవతం, పాద్మపురాణం మొదలైన పురాణాల సహాయంతో వేదాలలోని అర్థాన్ని వివరించాలి. ఆ విధంగా కాకుండా, ఇతిహాసపురాణాల సహాయం లేకుండా, వేదాలలోని అర్థాన్ని వివరించడానికి

ప్రయత్నం చేసేవానిని చూసి, వేదం, "అల్పజ్ఞాని అయిన ఇతడు నా హృదయాన్ని సరిగా ఆవిష్కరించడం లేదు " అని భయపడుతుంది) అని బార్హస్పత్యస్మృతి వచనం.

**"ప్రాయేణ పూర్వభాగార్థో ధర్మశాస్త్రేణ కథ్యతే,**
**ఇతిహాస పురాణాభ్యాం వేదాంతార్థః ప్రకాశ్యతే"**

(వేదంలోని పూర్వభాగంలో ఉండే అర్థం ధర్మశాస్త్రంచేత చెప్పబడుతున్నది. ఇతిహాసపురాణాలచేత వేదాంతాలలోని అర్థం ప్రకాశింప జేయబడుతున్నది) అనే ప్రసిద్ధ సూక్తి కూడా ఈ అర్థాన్నే తెలుపుతున్నది.

ఇందువల్ల, వేదాలలోని అర్థతత్వాల అవగాహన ఇతిహాస పురాణాల అవగాహన లేనిదే పూర్తి కాదని, వాటిలో జ్ఞానం లేకుండా వేదాలలోని అర్థాలను నిశ్చయించి చెప్పడానికి ప్రయత్నించడం తగిన క్రమం కాదని, ఆ విధంగా చెప్పడం సాహసమే అని స్పష్టమవుతున్నది. ఇందువల్ల, వైదికసిద్ధాంత ప్రవర్తకులు అందరూ కూడా, వేదాలను ప్రమాణంగా అంగీకరించినట్లే, ఇతిహాసపురాణాలను కూడా, వేదాలకు తరువాత ప్రమాణంగా గ్రహించి, తమ సిద్ధాంతతత్వాలను వివరించడానికి ప్రయత్నించారు. ఈ క్రమాన్ని వైదిక సిద్ధాంతాలు అన్నిటిలోనూ గమనించవచ్చు. ఇందువల్ల, వేదాంతంగా చెప్పబడే, ఉపనిషత్తులతో పాటు, ఆ వేదాంతాల అర్థాన్ని నిర్ణయించడానికి సహాయపడేవిగా చెప్పబడే ఇతిహాస పురాణాలను కూడా వైదికలు అందరూ ప్రమాణాలుగా అంగీకరించారు.

ఇతిహాసాలు, పురాణాలు– అనే ఈ రెండిటిలో, ఇతిహాసాలకు ప్రాధాన్యం అంగీకరింపబడింది. ఇతిహాసాలు అని ప్రసిద్ధి చెందిన గ్రంథాలు రెండు, అవి శ్రీరామాయణం, మహాభారతం అనేవి. ఈ రెండిటిలో కూడా,

శ్రీరామాయణంలో విశిష్టాద్వైతం

శ్రీరామాయణానికి ప్రాథమ్యం అంగీకరింపబడింది. కాలాన్నిబట్టి చూసినా, శ్రీరామాయణమే మొదటిది అని సంప్రదాయ పండితులు, సాహిత్యచారిత్రకులుకూడా అంగీకరించారు. ఈ రెండు వేదంతో సమానంగా పరిగణింపబడుతున్నవి.

**"వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే,**
**వేదః ప్రాచేతసాదాసీత్ సాక్షాద్రామాయణాత్మనా"**

(వేదాలచేత తెలియబడే పరమాత్మ, దశరథుని కుమారుడై అవతరించగా, ఆ వేదం, వాల్మీకిమునిద్వారా సాక్షాత్తు శ్రీరామాయణరూపంలో ఈ లోకంలో అవతరించింది) అనే పౌరాణికసూక్తి శ్రీరామాయణానికి కల వేదసామ్యాన్ని తెలుపుతున్నది. పంచమవేదంగా మహాభారతం వ్యవహరింపబడడం ప్రసిద్ధమే కదా.

ప్రధానమైన, లోకప్రసిద్ధిని చెందిన వైదికసిద్ధాంతాలు మూడిటిలో, విశిష్టాద్వైత సిద్ధాంతం ఒకటి. ఇది భగవద్రామానుజదర్శనమనికూడా వ్యవహరింపబడుతున్నది. ఈ సిద్ధాంతాన్ని ప్రవర్తింపజేయడంలో భగవద్రామానుజులు చేసిన మహోత్కృష్టమైన కృషిని దృష్టిలో పెట్టుకుని, శ్రీరంగనాథుడు ఈ సిద్ధాంతానికి భగవద్రామానుజుల పేరును పెట్టాడు అని సంప్రదాయ కథనం.

భగవద్రామానుజ సిద్ధాంత సంప్రదాయాలు. ఉభయవేదాంతక్రమాన్ని అనుసరించాయి. ఈ ఉభయ వేదాంతసంప్రదాయం అనేది "నాథోపజ్ఞం ప్రవృత్తమ్" అని శ్రీవేదాంతదేశికులు చెప్పినట్లుగా, శ్రీమన్నాథమునులనుండి ప్రారంభమై, శ్రీయామునాచార్యులవారిచేత అభివృద్ధిని పొంది, భగవద్రామానుజుల కాలంలో పూర్తిగా ఒక రూపాన్ని సంతరించుకొని స్థిరపడింది.

# శ్రీరామాయణంలో విశిష్టాద్వైతం

ఉభయవేదాంతాలు అంటే, సంస్కృత వేదాంతం, ద్రావిడ వేదాంతం – అని చెప్పబడే రెండు వేదాలు. సంస్కృత వేదాంతశబ్దం చేత, ఉపనిషత్తులు, వాటి అర్థాన్ని ప్రతిపాదించే భగవద్గీత, బాదరాయణముని ప్రణీతాలైన బ్రహ్మసూత్రాలు– అనే ఈ మూడు ప్రధానంగా గ్రహింపబడుతున్నాయి. శ్రీరామానుజ దర్శనంలోనే కాక, మిగిలిన వైదిక సిద్ధాంతాలలో అన్నిటిలోనుకూడా, తమ తమ సిద్ధాంతప్రతిపాదనలో ఆధారాలుగా ఈ మూడు ప్రధానంగా స్వీకరింపబడ్డాయి.

అయితే, ఉభయవేదాంత సంప్రదాయంగా ప్రసిద్ధి చెందిన భగవద్రామానుజ సిద్ధాంతంలోని విశేషం ఏమంటే, ఈ సంస్కృత వేదాంతంతో పాటు, ద్రావిడ వేదాంతంగా వ్యవహరింపబడే ఆళ్వారుల దివ్యప్రబంధాలుకూడా ప్రమాణాలుగా అంగీకరింపబడ్డాయి. భగవద్రామానుజులు బాదరాయణ బ్రహ్మసూత్రాలకు తాము శ్రీభాష్యమనే వ్యాఖ్యానాన్ని రచించేటప్పుడు, , ఇతరమతసిద్ధాంతాల నిరాకరణను, , స్వసిద్ధాంతప్రతిపాదనను, ఆళ్వారుల దివ్యప్రబంధాల పాశురాలలోని అర్థాలనుకూడా దృష్టిలో పెట్టుకొని, వాటిని సమన్వయం చేస్తూ చేశారని శ్రీవైష్ణవపూర్వాచార్యుల అభిప్రాయం. దీనిని వారు సోదాహరణంగా వివరించారుకూడా. ఇందువల్ల, భగవద్రామానుజ సిద్ధాంతంలో, సంస్కృత వేదాంతంతో పాటు, ద్రావిడవేదాంతానికికూడా సమానమైన స్థానం ఉన్నది.

ఇక్కడ ఒక విశేషం ఉన్నది. భగవద్రామానుజులవారు, శ్రీభాష్యరచనలో, మహాసిద్ధాంతంలోని స్మృతిపురాణ ఘట్టంలో, తమ సిద్ధాంతాన్ని ప్రతిపాదించడంలోను, ఇతర సిద్ధాంతాన్ని నిరాకరించడంలోను, ప్రధానంగా, పురాణాలనుండి శ్రీవిష్ణుపురాణ సూక్తులనే ప్రమాణాలుగా గ్రహించడం జరిగింది తప్ప, శ్రీరామాయణంనుండి ప్రమాణాలుగా ఏ సూక్తిని గ్రహించలేదు. కానీ, బ్రహ్మసూత్రాల అర్థాలను విశిష్టాద్వైతపరంగా

వివరించేటప్పుడు, శ్రీరామానుజులు, ఇతరసిద్ధాంతనిరాకరణను చేసేటప్పుడు, ఆళ్వారుల ప్రబంధాలలోని సూక్తులను దృష్టిలో పెట్టుకొని అర్థనిర్వాహాన్ని చేసినట్లే, ఆళ్వారుల పాశురాల అర్థతత్త్వాలను వివరించేటప్పుడు, శ్రీరామానుజులు, వారికి ముందు ఉన్న శ్రీశైలపూర్ణులు, యామునులు, నాథమునులు, మొదలైన ఆచార్యులు, తరువాత ఉన్న నంబిళ్ళై, , శ్రీకృష్ణసూరి మొదలైన ఆచార్యులు వేదసూక్తులతో పాటు, శ్రీరామాయణం శ్రీవిష్ణుపురాణం మొదలైన వేదోపబృంహణాలలోని సూక్తులనుకూడా ప్రమాణంగా ఉదాహరించారు. అందువల్ల, శ్రీవిష్ణుపురాణం మొదలైన గ్రంథాలవలె, శ్రీరామాయణంకూడా విశిష్టాద్వైతసిద్ధాంత సంప్రదాయ ప్రతిపాదక గ్రంథంగా ఆ సిద్ధాంతానుయాయులచే అంగీకరింపబడింది, సోదాహరణంగా నిరూపింపబడింది కూడా.

"పంచాచార్యపదాశ్రయః" అనే ప్రసిద్ధి చెందిన భగవద్రామానుజుల ఆచార్యులు అయిదుగురిలో, శ్రీశైలపూర్ణులు ఒకరు. వీరు, శ్రీరామానుజులకు మేనమామ కూడా. వీరి దగ్గరనే శ్రీరామానుజులు, తిరుపతి దివ్యక్షేత్రంలో, కొండ మెట్లు ప్రారంభం అయ్యే ప్రదేశం అయిన అలిపిరి దగ్గర, సంవత్సర కాలం పాటు శ్రీరామాయణంలోని విశిష్టాద్వైత సంప్రదాయ సిద్ధాంతార్థాలను అధ్యయనం చేశారని శ్రీరామానుజుల చరిత్ర తెలుపుతున్నది. శ్రీశైలపూర్ణులు ఈ అర్థాలను, తమ ఆచార్యులైన భగవద్యామునుల ఆజ్ఞ ప్రకారం, శ్రీరామానుజులకు ఉపదేశరూపంగా అందజేశారనికూడా సంప్రదాయ చరిత్రలోని కథనం. శ్రీయామునులు శ్రీరామాయణంలోని ఈ అపూర్వాలైన అర్థాలను అన్నిటిని తమ ఆచార్యులైన శ్రీరామమిశ్రులద్వారా పొందారు. వారు, తమకు ఆచార్యులైన పుండరీకాక్షులద్వారా, ఆ పుండరీకాక్షులుకూడా, తమకు ఆచార్యులైన శ్రీమన్నాథమునులద్వారా పొందారు. ఇందువల్ల ఈ

## శ్రీరామాయణంలో విశిష్టాద్వైతం

శ్రీరామాయణంలోని విశిష్టాద్వైత సిద్ధాంతసంప్రదాయ రహస్యార్థపరంపర అనేది నాథమునులనుండి ఈ లోకంలో గురుశిష్యక్రమంలో పరంపరగా ప్రవర్తించింది అని తెలుస్తున్నది. అందుచేత ఇది చాలా ప్రాచీనమైనది.

శ్రీనాథమునులు, ఆళ్వారుల దివ్యప్రబంధాలను, వాటి అర్థాలను అన్నిటిని, యోగదశలో, శ్రీశఠకోపసూరి అనబడే నమ్మాళ్వారులవల్ల పొందారు. వారుకూడా, విష్వక్సేనుల వల్ల, ఆ విష్వక్సేనులు శ్రీదేవి వల్ల, ఆమె భగవంతుడైన నారాయణునివల్ల శ్రవణం చేశారు కనుక, ఈ ఉభయవేదాంత సంప్రదాయం, శ్రీరామాయణం విశిష్టాద్వైత సిద్ధాంత సంప్రదాయ ప్రతిపాదకం అనే క్రమం, దివ్యసూరుల దివ్యప్రబంధాలవలె, అనాది అని ఏర్పడుతున్నదికదా.

విశిష్టాద్వైతం అనాది అయినప్పుడు కదా, ఆ సిద్ధాంసంప్రదాయంకూడా అనాది అని చెప్పదగి ఉన్నది. "విశిష్టాద్వైతం వేదమూలకం, అనాది" అనే విషయాన్ని గమనించడానికి ముందుగా, వేరొక విషయం.

ఈ విధంగా, భగవద్రామానుజుల వరకు పరంపరగా అందిన "శ్రీరామాయణం విశిష్టాద్వైతసిద్ధాంత సంప్రదాయ ప్రతిపాదకం" అనే క్రమం, వారికి తరువాత, వారి శిష్యపరంపరద్వారా ఈనాటికీ శిష్యాచార్యక్రమంలో కొనసాగుతూ వస్తున్నది. ఈ విధంగా తమకు ఆచార్యముఖంగా అందిన అర్థాలనే, శ్రీరామాయణానికి భూషణం అనే పేరు కలిగిన ఒక అద్భుతమైన వ్యాఖ్యానాన్ని రచించారు. గోవిందరాజాచార్యులవారు, ఆ వ్యాఖ్యానం ఆరంభంలో ఈ విషయాన్ని స్వయంగా తెలియజేశారుకూడా. అంతే కాదు, ఈ వ్యాఖ్యానం, శ్రీవైష్ణవసంప్రదాయంలో ప్రసిద్ధమైన నాలుగు దివ్య క్షేత్రాలలో

ఒకటైన తిరుమలలో, బేడి ఆంజనేయ స్వామి ఆలయానికి ముందుగా ఉన్న మండపంలో, రచింపబడడం ఇంకొక విశేషం.

ఇపుడు, "విశిష్టాద్వైతసిద్ధాంతం శ్రుతిమూలకం, అందువల్ల అనాది" అనే విషయాన్ని గమనిద్దాం.

కళ్ళు, చెవులు మొదలైన జ్ఞానేంద్రియాల ద్వారా పలు వస్తువులను మనం తెలుసుకుంటున్నాము. ఈ జ్ఞానానికి ప్రత్యక్షం అని పేరు. నదిలో నూతన ప్రవాహం వస్తే, దాని ఉత్పత్తి స్థానంలో వర్షం కురుస్తున్నది – అని తెలుసుకుంటున్నాము. ఇంటి లోపల మనం ఉన్నప్పుడు, పిడుగు శబ్దం వింటే, ఆకాశంలో మేఘం ఉన్నది – అని తెలుసుకుంటున్నాము. ఈ విధమైన జ్ఞానానికి అనుమానం అని పేరు. కొన్ని సమయాలలో దారాన్ని చూచి పాము అని భావిస్తున్నాము. ఇది ప్రత్యక్షమే అయినప్పటికీ, యథార్థమైన జ్ఞానం కాదు. చాలినంత వెలుతురు లేదు అనే కారణంచేత ఈ ప్రత్యక్షం అయథార్థజ్ఞానం అవుతున్నది. ఈ విధంగానే, పలు విధాలైన దోషాల వల్ల అనుమానంకూడా అయథార్థజ్ఞానంగా అవుతున్నది. ఈ విధంగా కాకుండా, ఏ విధమైన దోషం లేనప్పుడు ఏర్పడే ప్రత్యక్షం, అనుమానం యథార్థజ్ఞానం అవుతున్నవి. వీటివల్ల తెలియబడే వస్తువులు అంతా యథార్థమైన వస్తువులు అవుతాయి. దారంలో తోచిన పాము జ్ఞానం దోషం వల్ల ఏర్పడుతున్నది. దగ్గరకి వెళ్ళి చూసినప్పుడు, " ఇది పాము కాదు దారమే "అనే యథార్థమైన జ్ఞానం కలుగుతుంది. ఈ విధంగా జ్ఞానం కలిగిన తరువాత, ఏ కాలంలోనూ బాధింపబడనిది, ఏ విధమైన దోషం లేనిది అయిన జ్ఞానమే యథార్థజ్ఞానం. దీనివల్ల గ్రహింపబడే వస్తువు యథార్థమైన వస్తువు. " సూర్యుడు ఉన్నాడు "– అనే విషయాన్ని ప్రత్యక్షం వల్ల, "భూమి అతని చుట్టి వస్తున్నది, రాత్రి పగలు అందువల్ల ఏర్పడుతున్నాయి" అనే జ్ఞానం అనుమానంవల్ల తెలిసికుంటున్నాము. ఈ ప్రత్యక్షంలోను, అనుమానంలోనూ ఏ విధమైన

దోషం కనబడనందున, అనంతర కాలంలో వీటికి బాధ అనేది లేనందువల్ల, ఇవి యథార్థ జ్ఞానం అని, సూర్యుడు మొదలైన వస్తువులు యథార్థమైన వస్తువులు అని నిశ్చయం కలుగుతున్నది. అందువల్లనే, లోకంలో ఉండే యథార్థమైన వస్తువులను తెలుపడానికి ప్రత్యక్షం, అనుమానం – అనే రెండు ప్రమాణాలు ఉన్నాయి – అనేది తెలుస్తున్నది.

ప్రత్యక్షం, అనుమానం – అనే ఈ రెండు ప్రమాణాల కంటే, మూడవ ప్రమాణం ఒకటి ఉన్నది. అది వేదం. వేదం అనే పదానికి " జ్ఞానాన్ని కలిగించేది " అని అర్థం. ఇక్కడ, జ్ఞానం అని సామాన్యంగా చెప్పబడినప్పటికీ, ప్రత్యక్షం, అనుమానం – అని ఇంతకు ముందు చెప్పిన రెండు ప్రమాణాలవల్ల తెలియబడని వస్తువులనుగూర్చి ఏర్పడే జ్ఞానమే ఇక్కడ గ్రహింపబడుతున్నది. వాటివల్ల తెలియబడిన వస్తువులనే ఇది చెప్పినట్లయితే, ఇది కేవలం అనువాదం అవుతుంది తప్ప, ప్రమాణం కాబోదు. వేరొక ప్రమాణంచేత చెప్పబడిన వస్తువును చెప్పే పదం అనువాదం అనుబడుతున్నది. అందువల్ల, దానికి ప్రమాణం అనే స్థితి తొలగిపోయి, అప్రమాణం అనే స్థితి రాకుండా ఉండడంకోసం, మిగిలిన ప్రమాణాలచేత తెలియబడని వస్తువును తెలుపడంలోనే వేదంలో దృష్టి – అని తీర్మానం చేయబడింది.

ఈ విధంగానే ప్రత్యక్షంచేత, అనుమానంచేత నిశ్చయింపబడిన, సిద్ధమైన ఒక వస్తువును విరుద్ధమైన, అంటే, దానితో విరోధం కల ఒక వస్తువును వేదం తెలిపినట్లయితే, అది అపుడు ప్రమాణం కాకుండా, అప్రమాణమై పోతుంది. అందుచేత, మిగిలిన ప్రమాణాలచేత తెలియబడిన వస్తువులతో విరోధం లేనివి అయిన వస్తువులను తెలియజేసి, వేదం ప్రమాణం అవుతున్నది – అని సిద్ధాంతం.

ఈ విధంగా ప్రమాణం అయిన వేదంలోని వాక్యాలనుండి వాటి అర్థాన్ని గ్రహించడంకోసం మనం ప్రవర్తించేటప్పుడు, మనకు పలు సందేహాలు ఏర్పడడం సహజం. ఈ విధంగా ఏర్పడే సందేహాలు తొలగి, " ఈ వాక్యానికి ఈ విధంగానే అర్థం గ్రహించాలి, ఈ విధంగా గ్రహించకూడదు" అని నిర్ణయించుకోవడానికి తగిన వాక్యన్యాయాలు అనేకం ఉన్నాయి. వీటిని అన్నిటిని కూర్చి, మీమాంస అనే ఒక అరుదైన శాస్త్రాన్ని జైమిని మహర్షి రచించారు. ప్రత్యక్ష, అనుమానాలచేత తెలియడానికి సాధ్యం కానివి, వాటిచే తెలియబడినవాటికి విరుద్ధం కానివి అయిన అర్థాలనే వేదం తెలుపుతున్నది – అని, ఇంతకు ముందు చెప్పబడిన సిద్ధాంతం – వీరు రచించిన మీమాంసా శాస్త్రంలో చేయబడినది, వైదికులు అందరిచేత అంగీకరింపబడి సిద్ధాంతమే.

ఈ మహర్షి, ఈ మీమాంసాశాస్త్రంలో, వేదంలో మొదటి భాగంలో విధింపబడిన కర్మలు అనే ధర్మాలను ప్రధానవిషయంగా గ్రహించి, వాక్యన్యాయాలను వివరించారు. వీరికి ఆచార్యులు వ్యాసులు అని, బోధాయనులు అని ప్రసిద్ధులైన మహర్షి. వేదంలోని చివరి భాగాలై, అందువల్లనే వేదాంతాలు అని పిలువబడేవి అయిన ఉపనిషత్తులు ఉపదేశించే పరబ్రహ్మను ప్రధానవిషయంగా గ్రహించి, ఉపనిషత్తులలోని వాక్యాలనుండి పరతత్త్వాన్ని, దీనిని గూర్చిన మిగిలిన విషయాలను ఎటువంటి సందేహం లేకుండా నిశ్చయించుకోవడానికి తగినట్లుగా, విశేషన్యాయాలను కూర్చి, బ్రహ్మమీమాంస అనే బ్రహ్మసూత్రాలను  వ్యాసులు రచించినా, జైమిని నిరూపించిన వేదప్రామాణ్యంలోని ప్రకారాన్ని, ప్రమాణవాక్యాలనుండి వాటి అర్థాన్ని నిశ్చయించుకోవడానికి తగిన న్యాయాలను ఆ విధంగానే అంగీకరించారు.

ఈ విధంగా, ఈ ఇద్దరు మహర్షులు నిర్ణయించిన న్యాయాలను పురస్కరించుకునే మనం వేదంలోని అర్థాన్ని నిర్ణయం చేయాలి. వేదాంతం

అని పిలువబడే ఉపనిషత్తుకూడా వేదంలో ఉండే ఒక భాగమే కనుక, వేదంలోని మిగిలిన భాగాలవలెనే, అది, ఎవరిచేత రచింపబడకుండా, అనాదిగా ఉన్నందువల్ల, మానవులు రచించిన గ్రంథాలకువలె, వీటికి ఏ విధమైన దోషం చెప్పడానికి వీలు లేదు. అందువల్ల, జైమిని మహర్షి నిరూపించిన రీతిలో అది సంపూర్ణంగా ప్రమాణమై ఉన్నది. అయినప్పటికీ, దానిలో ఉండే వాక్యాలకు మహర్షులు తెలిపిన న్యాయాలను అనుసరించి అర్థాలను గ్రహించకుండా, వాటికి విరుద్ధంగా మనం ఒక అర్థాన్ని చెప్పినట్లయితే, అది ఉపనిషత్తుల అర్థం కాబోదు. అందుచేత, వాటికి విరుద్ధంగా ఉండకుండా, వాటిని అనుసరించే ఉపనిషత్తులలోని వాక్యాలకు పెద్దలు వ్యాఖ్యానం చేశారు. ఉపనిషత్తు అనేది ఏ మానవులచేత రచింపబడనిది, అనాది కనుక, దాని యథార్థమైన అర్థంగా ఏ సిద్ధాంతం ఉన్నదో, ఆ సిద్ధాంతమే అనాది అని కదా ఏర్పడుతున్నది.

ప్రత్యక్షంగా పలు పలు రూపాలను, వాటికి కారణమైన పృథివి మొదలైన భూతాలను మనం చూస్తున్నాము. కంటికి కనిపించకుండా, వాటిలో అంతర్భవించి ఉండే శక్తులను అనుమానంతో తెలుసుకుంటున్నాము. ఇవి అన్నీ జడపదార్థాలు, అంటే, జ్ఞానం లేని వస్తువులు.

మన శరీరం ఐదు భూతాలతో ఏర్పడుతున్నది. దీని లోపల, దీని కంటే భిన్నమైన, ఆత్మ అనే జ్ఞానం కలిగిన వస్తువు ఒకటి ఉన్నది – అనే విషయాన్ని జ్ఞానం లేని “అహం” అనే ప్రత్యక్షంచేత, అనుమానంచేత తెలుసుకుంటున్నాము. ఒక శరీరంలో ఉండే ఆత్మ, వేరొక శరీరంలో ఉండే ఆత్మచేత అనుభవింపబడే సుఖదుఃఖాలను అనుభవించకుండా ఉన్నందున, ఒక్కొక్క శరీరంలోనూ వేరు వేరు ఆత్మ ఉన్నదని, అందువల్లనే, శరీరాలవలెనే ఈ ఆత్మలుకూడా అనేకం అని తెలుసుకుంటున్నాము. ఇవి జీవాత్మలు అనబడుతున్నాయి. ఇవి ఈ శరీరాలలో ఉంటూ, కోరిన వస్తువులను

కోల్పోయి, కోరకపోయినా వచ్చే కష్టాలను అనుభవిస్తూ, బాధపడుతున్న అల్పశక్తిని, జ్ఞానాన్ని కలిగినవి జన్మిస్తూ, మరణిస్తూ, క్లేశాలను అనుభవిస్తున్నవి.

ఈ విధమైన ఆత్మలు, వీటికి కల శరీరాలు, ఇంద్రియాలు, ప్రాణం, నివసించే చోటు, ఇవి అనుభవించే వస్తువులు – అని ఈ విధంగా ఉండే జడపదార్థాలు, అన్నీ కలిసే ఈ జగత్తు అవుతున్నది. ఒకడు సృష్టించకుండా ఈ లోకం ఉండడానికి అవకాశం లేదు. కనుక, దీనిని సృష్టించినవాడు ఒకడు ఉండి తీరాలి. అతడే ఈశ్వరుడు – అని అనుమానంచేత ఈశ్వరుని కొందరు తెలుసుకుంటున్నారు. ఈ విధంగా తెలుసుకోవడానికి సాధ్యం కాదు – అని కొందరు అంటున్నారు. ఈ విషయం ఏ విధంగా ఉన్నప్పటికీ, ఈశ్వరునిగూర్చిన అన్ని విషయాలను తెలియజేయడమే ముఖ్యలక్ష్యంగా కలిగినవి ఉపనిషత్తులు కనుక, ఇదే ఈ విషయాలలో ప్రమాణం – అని అంటారు, పెద్దలు.

ఈశ్వరుని, బ్రహ్మం అని, పరబ్రహ్మం అని ఉపనిషత్తులు చెబుతున్నాయి. పరబ్రహ్మం ఏది? అంటే, ఈ లోకాన్ని అంతటినీ సృష్టించి, రక్షించి, లయం చేసేది ఏదో, అదే పరబ్రహ్మం – అని ఉపనిషత్తులు తెలుపుతున్నవి. ఈ విధంగా లోకాన్ని అంతటికి కారణమైన పరబ్రహ్మం సర్వజ్ఞం అని, అన్ని విధాలయిన శక్తులను కలిగినది అనికదా ఏర్పడుతున్నది. అయినప్పటికీ, స్పష్టంగానే, ఈశ్వరుడు సర్వజ్ఞుడు అని, సర్వశక్తి అని, ఏ విధమైన దోషం, లోటు లేనివాడు అని, అన్ని విధాలైన మంగళగుణాలను కలిగినవాడు అని ఉపనిషత్తు కీర్తిస్తూ పలుకుతున్నది. తమ స్వరూపంతో జీవాత్మలు నిత్యులు. ఆ విధంగానే ఈశ్వరుడుకూడా నిత్యుడే. ఈ విధంగా కొన్ని విషయాలలో సామ్యం ఉన్నప్పటికీ, " జీవాత్మలు తాము కోరినదానిని పొందడం అనేది పరబ్రహ్మంవల్లనే, వీరికి ఆవశ్యకమైనదానిని ఇచ్చేవాడు

అతడే. జీవాత్మలు అనేకులు, అతడు ఒక్కడే"– అని, ఈ విధంగా భగవంతునకు, మనకు మధ్య గల భేదాలను ఉపనిషత్తులు తెలుపుతున్నవి. ఈ విధంగానే అతనికి సమానమైనవాడు కానీ, అతని కంటే గొప్పవాడు కానీ ఎవడు లేడు – అని కూడా పలుకుతున్నది. అందుకే, ఈశ్వరుడు ఒక్కడే అనేది నిశ్చయింపబడుతున్నది. అందుచేత, ఈశ్వరునకు సంబంధించినంతవరకు, ఉపనిషత్తు బోధించే సిద్ధాంతం అద్వైతమే. అంటే, రెండవ ఈశ్వరుడు ఎవడూ లేడు – అనే విషయంలో వివాదం ఏమీ లేదు. అయితే, అతడు జగత్కారణమై, సర్వజ్ఞుడై, సర్వశక్తియై, సకలకళ్యాణగుణపూర్ణుడై ఉండడం అంతాకూడా మాయాసంబంధంచేతనే. స్వయంగా అతడు ఏ విధమైన గుణాన్ని లేని, కేవల చైతన్యమే – అనేది ఉపనిషత్తుల సిద్ధాంతం కాదు. ఈశ్వరుని పలు పలు గుణాలను చాలా స్పష్టంగా విశదంగా ఉపదేశించే ఉపనిషత్తులకు ఈ విధంగా అర్థాన్ని గ్రహించడం ఏ మాత్రం పొసగదు. ఇంకా చెప్పాలంటే, ఇది నేరుగా విరుద్ధమైనది. దానిని వంచించడానికి పనికి వస్తుంది, అంతే. నిర్గుణం అని పరమాత్మను ఉపనిషత్తు చెబుతున్నదికదా – అని అంటే, మీమాంసా న్యాయాలను పురస్కరించుకొని, " దీనికి ఏమి అర్థం? " అని నిశ్చయించాలి. ఆ విధంగా గమనించి చూసినప్పుడు, జీవాత్మలను బంధించి, సంసారంలో బాధలను పొందేటట్లుగా చేసే సత్వరజస్తమస్సులు అనే మూడు గుణాలను, అ లేనివాడు ఈశ్వరుడు – అని ఈ నిర్గుణపదం తెలుపుతున్నది – అనేది ఏర్పడుతున్నది. అందుచేత, గుణవిశిష్టుడైన ఈశ్వరుని అద్వైతమే ఉపనిషత్తుల అభిప్రాయమై ఉన్నది.

ఇక, **"సదేవ సౌమ్య ఇదమగ్ర ఆసీత్, ఏకమేవ, అద్వితీయమ్"** అని అంటూ, సృష్టి ఆరంభంలో సత్తు అనబడే బ్రహ్మమే ఉన్నది, అది ఒక్కటే ఉన్నది, రెండవది ఏది లేదని కేవలం అద్వైతాన్ని స్పష్టంగా ఉపదేశిస్తున్నదే.

దీనివల్ల శుద్ధబ్రహ్మం తప్ప, మిగిలినది అంతా అసత్యం అని ఏర్పడుతున్నది కదా– అని అంటే, ఇక్కడకూడా ఈ అర్థం యథార్థమైన అర్థం కాదు. తరువాత "తదైక్షత"– ఆ పరబ్రహ్మం సంకల్పించింది – అని బ్రహ్మం సంకల్పించినట్లుగా చెప్పడంవల్ల, ఇక్కడ సత్ అని నిర్గుణబ్రహ్మం ఉద్దేశింపబడలేదు– అనే విషయం స్పష్టపడుతున్నది. "సత్ అనే బ్రహ్మమే ఉన్నది" అని అన్నందువల్ల, ఈ ఉపనిషత్తే తరువాత తెలియజేసిన విధంగా, అసత్తు లేదు – అని నిషేధం చేయబడుతున్నదే తప్ప, సత్ అనదగిన ఏ వస్తువు నిషేధింపబడినట్లు కాబోదు.

"ఏకమేవ" –ఒకటే ఉన్నది – అనే విషయంకూడా, తరువాత "బహుస్యాం ప్రజాయేయ" అని సంకల్పించి, ఆ విధంగానే అనేకవిధాలుగా పరబ్రహ్మం అయినది – అని ఉపనిషత్తులలో చెప్పబడినందువల్ల, సృష్టికి తరువాత అది ఏ విధంగా పలు రూపాలను పొందిందో, ఆ విధంగా కాకుండా, సృష్టికి ముందు ఒక్కటే రూపంలో ఉన్నది – అనే అర్థాన్ని కలిగినది– అనేది ఇక్కడ స్పష్టపడుతున్నది.

"పరబ్రహ్మం మొదట ఒకటిగానే ఉన్నది, తరువాత అనేకంగా మారింది" అని అంటే, " ఇది మట్టి, మొదట ఒకటిగానే ఉన్నది, తరువాత అది చట్టి, బాన – అని ఈ విధంగా అనేక విధాలుగా అయినది" అని చెప్పినట్లు అవుతున్నది. ఇక్కడ, ఒకటిగానే ఉన్న మట్టి అనేక విధాలుగా మారడానికి కారణంగా కుమ్మరివాడు ఒకడు ఉన్నట్లుగానే, సత్తు అనేది పలు విధాలుగా మారడానికి కారణంగా, దాని కంటే వేరు ఒకడు ఉండి ఉండాలి కదా? ఆ కారణం ఎవరు? అనే సందేహం ఇక్కడ ఏర్పడుతున్నది. ఆ సందేహాన్ని పోగొట్టడంకోసమే వేదంలో " ఏకమేవ, అద్వితీయమ్" –రెండవదిగా, వేరొకటి ఏమీ లేనిదై సత్తు ఉన్నది – అని చెప్పబడింది. అందుచేత, ఇక్కడ, ప్రమాణాల చేత తెలియబడిన ఏ వస్తువుకు నిషేధం లేదు. ప్రత్యక్షంచేత, అనుమానంచేత

తెలియబడిన విషయాలను విడచి, ఆ ప్రత్యక్షంచేత, అనుమానంచేత తెలియడానికి సాధ్యం కాని విషయాలలోనే వేదం ప్రమాణం– అని స్థాపించబడినదై ఉన్నందువల్ల, మనం చూచే ఈ లోకాన్ని అసత్యం అని అనడంలో ఉపనిషత్తులకు అభిప్రాయం ఎంతమాత్రం ఉండదు. . ఇది దీనిని అసత్యంగా చేయడానికి దానికి శక్తి కూడా లేదు. ఈ లోకాన్ని ఆ విధంగానే యథార్థంగా గ్రహించి, ఈ లోకానికి, ఈశ్వరునికి మధ్య ఉన్నదై, మనం తెలియనిది అయిన సంబంధాన్ని ఉపదేశించడంలోనే ఉపనిషత్తులకు ఉద్దేశ్యం ఉన్నది.

జ్ఞానం లేనిది, లోకంలో ఉండే అన్ని రూపాలుగాను మారుతున్నది – ప్రకృతి అనే జడపదార్థం. జ్ఞానం ఉన్నందువల్ల, దీనికంటే విలక్షణమైనది అయిన జీవాత్మ అణువుగాను, ఈశ్వరునకు పరతంత్రంగానూ ఉన్నది. అంతటా వ్యాపించి ఉన్నవాడై, స్వతంత్రుడై, సర్వజ్ఞుడై ఉన్నందువల్ల, ప్రకృతి జీవాత్మలనే తత్వాల కంటే పూర్తిగా ఈశ్వరుడు విలక్షణమైన తత్త్వమై ఉన్నాడు. ఈ విధంగా, ఈ మూడు తత్వాలు పరస్పరం భేదాన్ని కలిగినవై ఉండగా, " ఈ లోకం అంతా ముందు బ్రహ్మం గానే ఉన్నది " అని వేదం అభేదంగా చెప్పడం ఏ విధంగా? అనే ఒక పెద్ద ప్రశ్న ఇక్కడ ఏర్పడుతున్నది.

దీనికి ఉపనిషత్తులలోని వాక్యాలను గ్రహించే సమాధానాన్ని చెబుతారు, మన పెద్దలు. " నేను అనేకంగా కాగలను, అందుకోసం జన్మిస్తాను" అని పలికిన ఉపనిషత్తు, ఆ తరువాత, " అది అగ్ని అయినది, అగ్ని అయి జన్మించింది" అని చెప్పకుండా, "తత్తేజో అసృజత" – అది అగ్నిని సృష్టించింది – అని చెబుతున్నది ఇక్కడ, సృష్టికర్త అయిన బ్రహ్మం వేరు, సృష్టింపబడినది అయిన అగ్ని వేరు – అనేది స్పష్టం అవుతున్నది. ఈ విధంగా భేదాన్ని స్పష్టంగా చెప్పిన అదే ఉపనిషత్తు, , ఆ తరువాత, "ఆ అగ్నినుండి జలాన్ని సృష్టిస్తాను –అని సంకల్పించింది, ఆ విధంగానే జలాన్ని సృష్టించింది"

అని చెప్పకుండా, "ఆ అగ్ని చూచింది. అనేకంగా కాగలను. అందుకోసం జన్మిస్తాను —అని అది జలాన్ని సృష్టించింది " అని పలికింది. ఇందువల్ల, అగ్నిని తెలిపే పదమే బ్రహ్మాన్ని కూడా తెలుపుతుంది – అని ఉపనిషత్తు తెలుపుతున్నది. "ఐక్షత" – చూచింది – అని సంకల్పం చెప్పబడినందువల్ల, జలాన్ని సృష్టించిన అగ్ని, కేవలం జడపదార్థమైన అగ్ని కాదు. బ్రహ్మంగానేకదా అది ఉండి ఉండాలి. దీనివల్ల జడవస్తువు అయినందువల్ల, బ్రహ్మచేత సృష్టింపబడినదిగా అయినందువల్ల, అగ్ని బ్రహ్మం కంటే వేరుపడినది అయినప్పటికీ, బ్రహ్మాన్ని అగ్నిగానే చెప్పవచ్చు – అని ఇక్కడ వివరింపబడినట్లు అవుతున్నది. దీనివల్ల, మిగిలిన ప్రమాణాలచేత తెలియబడిన భేదాన్ని ఆ విధంగానే ఒప్పుకొని, అభేదంగా శాస్త్రం పలుకుతున్నది– అనే అపూర్వమైన ఒక విషయం ఇక్కడ స్పష్టపడుతున్నది. ఇక, ఇది, ఏ విధంగా పొసగుతుంది? అని గమనించి చూడాలి. దీనినికూడా ఈ ఉపనిషత్తే వివరిస్తున్నది.

పైన కనబడే ప్రకరణాలలో, "ఈ జీవులు అందరూ బ్రహ్మంనుండే పుడుతున్నారు, బ్రహ్మంలోనే నిలచి ఉన్నారు. చివరిలో ఆ బ్రహ్మంలోని ఐక్యం అవుతున్నారు" అని చెప్పబడుతున్నది. సృష్టింపబడే ఒక్కొక్క ద్రవ్యానికి కారణావస్థ, కార్యావస్థ, నాశం – అనే మూడు అవస్థలు ఉన్నాయి. భగవంతునిచేత సృష్టింపబడిన చేతనాచేతన సర్వవస్తువులు, ఈ మూడు దశలలోనూ, అతనిలోనే ఉన్నాయి. ఆ పరమాత్మను విడచి ఏ సమయంలోనూ ఉండవు. ఏ స్థితిలోనూ తనను విడచి ఉండని ఈ వస్తువులను అన్నిటిని తన ఇష్టానుసారంగా ఆ యా స్థితులలో భగవానుడు నిలుపుతున్నాడు. ఈ విధంగా, తనను విడచి ఉండని ద్రవ్యాలను తన ఇష్టానుసారంగా నియమనం చేస్తూ ఉండే, జ్ఞానం కల ఈ వస్తువుకు విలక్షణమైన ఒక పేరు ఉన్నది. దానిని చెబుతూ, పైన ఉపనిషత్తు పలుకుతున్నది. ఉద్దాలకుడు తన పుత్రుడైన శ్వేతకేతువునకు

ఉపదేశిస్తున్నాడు – అనే క్రమంలో, "ఇంతవరకు నేను ఉపదేశించిన పరతత్త్వాన్ని ఆత్మగా కలిగినదిసుమా, మనం చూచే ఈ లోకం అంతా. అది సత్యం, అది ఆత్మ" అని అంటూ పలుకడంవల్ల లోకంలో అంతర్భవించి ఉండే ఒక్కొక్క వస్తువుకు కూడా భగవానుడు ఆత్మ, ఒక్కొక్క ద్రవ్యం అతనికి శరీరం" అని చెప్పినట్లయినది.

ఈ విధంగా, భగవంతునకు, లోకానికి మధ్య ఉండేది శరీరాత్మభావ సంబంధం అనడంలో భావం ఏమంటే– శరీరాన్ని నిర్దేశించే పదాలు అన్నీ ఆత్మను నిర్దేశిస్తాయి అనే. "ఈ బ్రాహ్మణుడు విద్వాంసుడు" అని అంటున్నాము. ఇందులో, ఈ ప్రయోగంలో, లోక రీతిలో, దోషం ఏమీ లేదు. అయినా, ఇందులో ఒక ఆక్షేపం ఉన్నది. అది ఏమంటే, ఆత్మలో బ్రాహ్మణత్వజాతి లేదు. శరీరత్వంలోనే ఉన్నది. అందుకే బ్రాహ్మణశబ్దం శరీరాన్ని నిర్దేశిస్తుంది. అయితే, విద్వాంసుడు అనే పదం శరీరాన్ని నిర్దేశిస్తున్నది కనుక, అందులో చేరదు. ఎందుకంటే, శరీరం జ్ఞానం కలిగినది కాదు కనుక. అందుచేత, ఈ విధంగా చెప్పడం సరి కాదు – అని అనవచ్చు. అయినా, బ్రాహ్మణుడు అనే పదం "బ్రాహ్మణ శరీరాన్ని కలిగినవాడు– అనే అర్థంలోనే ఉపయోగింపబడుతున్నందువల్ల, అటువంటి శరీరాన్ని కలిగిన ఆత్మ జ్ఞాని అయినందువల్ల, ఈ ప్రయోగం లో ఏ విధమైన దోషం లేదు – అనేది ఇక్కడ సమాధానం. ఈ న్యాయాన్ని ఇక్కడ చూపించినందువల్ల, పూర్వం శరీరమైన అగ్నిని నిర్దేశించే శబ్దాన్నే దానికి ఆత్మ అయిన పరబ్రహ్మం అనే అర్థంలో ప్రయోగించడం అనేది సరియే అనేది నిరూపింపబడినది అవుతున్నది ఈ నిరూపణాన్ని ఊర్జితం చేయడంకోసమే, మొదట "తత్త్వమసి" – ఆ పరబ్రహ్మం నీవై ఉన్నావు– అని ఉపనిషత్తులో చెప్పబడింది. " నీవు శరీరమై ఉండగా, నీకు ఆత్మవై ఉండేది ఇదే. లోకానికి అంతటికి ఆత్మ అయి ఉండేది ఈ పరబ్రహ్మమే నీకుకూడా ఆత్మ" అని ఇక్కడ తాత్పర్యం.

ఈ విధంగా లోకానికి, భగవంతునికి మధ్య ఉండే కార్యకారణభావాన్ని ఉపదేశించే శాస్త్రం శరీరాత్మభావాన్నికూడా ఉపదేశిస్తున్నది. అందుచేత, భగవంతుడు సకలకల్యాణగుణవిశిష్టుడు అయినట్లుగానే, ఏ దశలో అయినా చేతనాచేతన సకలవిశిష్టుడై ఉన్నాడు – అనేది సిద్ధిస్తున్నది.

ఈ నిర్ణయంలో, లోకాన్ని అసత్యం అనడం, ప్రత్యక్ష అనుమానాలను, పలు పలు భేదశ్రుతులను అప్రమాణాలు అని చెప్పడం, అభేదశ్రుతికి లక్షణను గ్రహించి, జీవాత్మకు, పరమాత్మకు మధ్య భేదాన్ని తెలియజేసే ప్రత్యక్షాది సకలప్రమాణాలకు విరోధం వచ్చే రీతిలో అర్థాన్ని గ్రహించడం– అని ఈ విధంగా ఉండే దోషాలు ఏమీ లేకుండా, సర్వప్రమాణాలు, సర్వశ్రుతివాక్యాలు చాలా అనుకూలంగా ఉన్నందువల్ల, సకలకల్యాణగుణ సకలచేతనాచేతనవిశిష్టుడైన శ్రీమన్నారాయణుడు ఒక్కడే తత్వం – అనే విశిష్టద్వైతసిద్ధాంతమే ఉపనిషత్తుల సిద్ధాంతం –అనేది, అందువల్ల, ఇదే అనాది సిద్ధాంతం – అనేది విజ్ఞులు అందరూ అంగీరించిన, అంగీకరించవలసిన విషయం.

భగవద్బోధాయనులు మొదలైన మహర్షులు ఆదరించిన సిద్ధాంతంకూడా ఇదే అయినందువల్ల, ఇదే అనాది అనేది కాదనడానికి వీలు లేని విషయం. వేదంలోని కర్మకాండం అనబడే మొదటి భాగాన్ని పురస్కరించుకొని చూస్తేకూడా, ఈ విశిష్టాద్వైతసిద్ధాంతం అందులో కూడా అంతర్భవించి ఉన్నది – అనేది స్పష్టపడుతుంది.

ఇప్పుడు, ఇక, శ్రీరామాయణంలో ఈ విశిష్టాద్వైతసిద్ధాంత సంప్రదాయ తత్వాలు ఆవిష్కరింపబడ్డ రీతిని యథామతి సంగ్రహంగా గమనిద్దాం.

# శ్రీరామాయణంలో విశిష్టాద్వైతసిద్ధాంత సంప్రదాయ తత్త్వాలు

వేదమూలకమైన విశిష్టాద్వైతసిద్ధాంతాన్నే వేదప్రతిరూపమైన శ్రీరామాయణం ప్రతిపాదిస్తున్నది – <అని భగవద్రామానుజ సంప్రదాయానికి చెందిన పూర్వాచార్యులు అందరూ భావించి, ఆ ఇతిహాసంలోని పలు సూక్తులను తమ గ్రంథాలలో, వ్యాఖ్యానాలలో పలు చోట్ల ప్రమాణంగా గ్రహించారు. భగవద్రామానుజులవారు కాని, ఇంతకు ముందున్న శ్రీయామునులు మొదలైన పూర్వాచార్యులు కానీ, తాము రచించిన తత్వనిర్ణాయకాలైన గ్రంథాలలో శ్రీవిష్ణుపురాణంనుండి, భగవద్గీతనుండి పలు శ్లోకాలను ప్రమాణాలుగా ఉదాహరించినప్పటికీ, శ్రీరామాయణంలోని శ్లోకాలనుమాత్రం ఎక్కడా ప్రమాణంగా ఉదాహరించినట్లు కనిపించదు. (భగవద్రామానుజులుమాత్రం, శ్రీభాష్యంలో, ఒకటి రెండు చోట్ల, శ్రీరామాయణ శ్లోకాలను ఉట్టంకించడం గోచరిస్తుంది.) దీనికి కారణం ఏమంటే, శ్రీరామాయణంలో తత్త్వప్రతిపాదన శబ్దతః కాకుండా, ఆయా వృత్తాంతాలద్వారా ప్రతిపాదింపబడడమే. దీనిని గమనించిన భగవద్రామానుజ సిద్ధాంతానికి చెందిన పూర్వాచార్యులు పలువురు ఆళ్వారుల దివ్యప్రబంధాల వ్యాఖ్యానాలలో, రహస్యగ్రంథాలలో, పలు శ్రీరామాయణశ్లోకాలను తాము ప్రతిపాదించే అర్థాలకు సంవాదంగా ఉదాహరించి, శ్రీ రామాయణంలోని విశిష్టాద్వైతవేదాంత తత్త్వాల విశదీకరణను చేశారు.

శ్రీరాముడు ఆరాధించిన శ్రీరంగనాథుడు శ్రీరంగంలో ఈ నాటికీ వేంచేసి ఉండడం, ఆ శ్రీరంగదివ్యనగరం విశిష్టాద్వైతసిద్ధాంత సంప్రదాయ ప్రచార కేంద్రంగా ప్రాచీన కాలంనుండి విలసిల్లడమే చాలు, శ్రీరామాయణానికి, విశిష్టాద్వైతానికి మధ్య ఉండే అవినాభావసంబంధాన్ని

నిరూపించడానికి. ఇంతే కాకుండా, శ్రీరామానుజులు 18 పర్యాయాలు శ్రీరామాయణంలోని విశేషార్థాలను తమ మేనమామ అయిన పెరియ తిరుమలనంబినుండి శ్రవణం చేశారు – అనే చరిత్రకూడా శ్రీరామాయణానికి, శ్రీరామానుజ దర్శనానికి మధ్య ఉండే గాఢమైన సంబంధాన్ని వ్యక్తం చేస్తున్నది.

వాల్మీకి మహాముని అడిగిన ఒక ప్రశ్నకు సమాధానంగా శ్రీరామాయణం అవతరించినది. "కో న్వస్మిన్ సాంప్రతం లోకే గుణవాన్? " అని ఆరంభించి వరుసగా పదహారు గుణాలను ప్రస్తావించి పలికి, " ఈ 16 గుణాలు కలిగిన మానవుడు ఇప్పుడు ఈ లోకంలో ఎవరు ఉన్నారు ?" అని వాల్మీకిమహర్షి నారదమహర్షిని అడిగాడు. ఈ ప్రశ్నయే విశిష్టాద్వైత సిద్ధాంతానికి జీవనాడిగా ప్రకాశిస్తున్నది. ఈ సిద్ధాంతంలో పరమాత్మ "సకల కళ్యాణగుణాలతో నిండినవాడు, ఏ దోషాలు లేనివాడు" అని తెలుపబడుతున్నది. ఇదే కాకుండా, అనేకగుణాలను వివరించి, వాటితోకూడిన నరుడు ఎవరు? అని వాల్మీకి ప్రశ్నించగా, "ఇక్ష్వాకుకులంలో అవతరించిన రాముడే ఆ నరుడు" అని నారదుడు బదులిచ్చాడు. ఆ శ్రీరాముని, శ్రీరామాయణంలో పలువురు పరతత్త్వంగా దర్శించారు. ఉదాహరణకు రెండు మూడు సందర్భాలను గమనిద్దాం.

నారాయణుడే ఈ లోకంలో నరుడై అవతరించాడని ఆదికావ్యం పలు సందర్భాలలో తెలియజేసింది. శ్రీరాముని గుణాలు ఆ నారాయణుని గుణాలే కనుక, అవి, ఆ స్వామిని ఆశయించాడానికి సాధనంగాను ఆశ్రయించిన తరువాత ప్రాప్యంగా అనుభవించడానికి తగినవిగాను ప్రకాశిస్తున్నాయి. భగవద్రామానుజసిద్ధాంతంలో విశిష్టగుణవిశిష్టుడైన భగవానుడే ముముక్షువునకు మోక్షసాధనం అని, సకలకళ్యాణ గుణవిశిష్టుడైన ఆ భగవానుడే ప్రాప్యమని చెప్పబడుతున్నది.

అవతార దశలో భగవానుని పరత్వం అనేది మరగుపడి ఉన్నప్పటికీ, అది మాటిమాటికి అనేక సందర్భాలలో వ్యక్తం అవుతూనే ఉంటుంది. ఈ క్రమాన్ని శ్రీరామావతారంలో అనేక సందర్భాలలో గమనించవచ్చు.

బాలకాండ చివరిలో 76వ సర్గలో, శ్రీరాముని వల్ల గర్వభంగాన్ని పొంగిన పరశురాముడు శ్రీరాముని స్తుతిస్తూ–

**"అక్షయ్యం మధుహంతారం జానామి త్వాం సురేశ్వరమ్" (17)**

(నీవు ఏ విధమైన వికారాన్ని లేనివాడవు, మధువు అనే అసురుని సంహరించినవాడవు, అమరులకు ప్రభువు అని గ్రహించాను) అని అన్నాడు.

ఇక్కడ, "అక్షయ్యమ్" అనే పదాన్ని "నిర్వికారం" అని, "మధుహంతారం" అనే పదాన్ని "విరోధినిరసనశీలం" అని వివరించిన గోవిందరాజీయ వ్యాఖ్యానం, "అనేన, న బ్రహ్మా నేశానః– ఇతి మహోపనిషత్ ఉపబృంహితా" అని కూడా తెలిపింది.

ఇదే విధంగా యుద్ధకాండ చివరిలో బ్రహ్మ (120వ సర్గలో)

**"కథం దేవగణ శ్రేష్ఠ! నాత్మాన మవబుద్ధ్యసే?"**

(దేవగణాలలో శ్రేష్ఠుడవైన శ్రీ రామా! ఎందుకు నీవు నిన్ను పరతత్త్వంగా గ్రహించడం లేదు?) అని అన్నాడు.

అని,

**"భవాన్ నారాయణో దేవః శ్రీమాన్ చక్రాయుధో విభుః"**

(నీవు సాక్షాత్తు శ్రీమన్నారాయణుడవు. సుదర్శన చక్రాన్ని ఆయుధంగా ధరించే ప్రభువువు) అని శ్రీరాముని పరత్వాన్ని ఉగ్గడించాడు.

తన భర్త అయిన వాలిని కోల్పోయిన తార, భర్తను చంపిన రాముని పై అంతు లేని ఆగ్రహంతో అతని నిందించాలని వచ్చినప్పటికీ, రాముని

చూడగానే, ఆమె మనసులో ఉండే అజ్ఞానం అంతా తొలగిపోగా. ఆమె శ్రీరాముని పరతత్వంగా (24వ సర్గలో) స్తుతించినది.

**"త్వమప్రమేయశ్చ దురాసదశ్చ**
**జితేంద్రియ శ్శోత్తమధార్మికశ్చ,**
**అక్షయకీర్తిశ్చ విచక్షణశ్చ**
**క్షితిక్షమావాన్ క్షతజోపమాక్షః"**

అనే ఈ శ్లోకానికి గోవిందరాజాచార్యులవారు చేసిన వ్యాఖ్యానం ఇక్కడ విశేషించి గమనించదగినది.

ఇదేవిధంగా రావణుడు మరణించిన తరువాత, మండోదరి శ్రీరాముని స్తుతిస్తూ (114వ సర్గలో) పలికిన–

**"వ్యక్తమేష మహాయోగీ పరమాత్మా సనాతనః,**
**అనాదిమధ్యనిధనః మహతః పరమో మహాన్,**
**తమసః పరమో ధాతా శంఖచక్రగదాధరః,**
**శ్రీవత్సవక్షాః నిత్యశ్రీ అజయ్యః శాశ్వతో ధ్రువః,**
**మానుషం వపు రాస్థాయ విష్ణుః సత్యపరాక్రమః"**

అని మొదలైన వాక్యాలు, వీటిని వివరిస్తూ గోవిందరాజాచార్యులవారు చేసిన అద్భుతమైన వివరణలు కూడా ఇక్కడ స్మరించదగినవి. ఇవి అన్ని " శ్రీరాముడు సాక్షాత్ పరతత్వం" అనే విషయాన్ని నిరూపిస్తున్నవి.

ఈ విధంగా శ్రీరామాయణంలో పలుచోట్ల శ్రీరాముని పరత్వం ప్రకటితమైనది.

శ్రీరామాయణంలో విశిష్టాద్వైతం

శ్రీరామాయణగ్రంథాప్రారంభమే విశిష్టాద్వైత సిద్ధాంతానుగుణంగా జరిగినది– అనే విషయంకూడా గమనించదగినది.

**"పరీక్ష్య లోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో నిర్వేద మాయాత్,—**
**తద్విజ్ఞానార్థం స గురుమేవాభిగచ్ఛేత్,**
**సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్,**
**తస్మై స విద్వాన్ ఉపసన్నాయ సమ్యక్**
**ప్రశాంతచిత్తాయ శమాన్వితాయ**
**యేనాక్షరం పురుషం వేద సత్యం,**
**ప్రోవాచ తాం తత్త్వతో బ్రహ్మవిద్యామ్"**

(పుణ్యకర్మల చేత సంపాదింపబడిన ఫలాలు అనిత్యాలు. నిత్యుడైన భగవంతుడు అనిత్యాలైన కర్మలచేత సిద్ధించడు– అని గ్రహించి, మనసులో చింతను పొందిన వేదాధ్యాయి, శ్రోత్రియుడు, బ్రహ్మనిష్ఠుడు అయిన ఆచార్యుని ఆశ్రయించాలి. అతనికి ఆచార్యుడు బ్రహ్మప్రాప్తి సాధనమైన బ్రహ్మవిద్యను ఉపదేశించాలి) అని ముండకోపనిషత్తు తెలుపుతున్నది. ఏడు సంవత్సరాల వయస్సులో (గర్భాష్టమంలో) ఉపనీతుడు అయిన బ్రహ్మచారి గురుకులంలోకి వెళుతున్నాడు. శిక్ష, వ్యాకరణం, ఛందస్సు మొదలైన అంగాలతో వేదాన్ని అధ్యయనం చేస్తున్నాడు. వేదంలోని చివరి భాగం అయిన వేదాంతాన్నికూడా అధ్యయనం చేస్తున్నాడు. ఈ విధంగా అధ్యయనం చేసి అక్షరరాశిని గ్రహించగా, అతనికి వేదభాగంలోనూ, వేదాంతంలోనూ ఆపాత ప్రతీతి కలుగుతున్నది. ఈ ఆపాత ప్రతీతి "నిశ్చయ ప్రతీతిగా కావాలి" అనే ఇచ్ఛ అతనికి కలుగగానే, అతడు వేదాంత విచారాన్ని చేయడానికి ఆరంభిస్తున్నాడు.

## శ్రీరామాయణంలో విశిష్టాద్వైతం

మొదట, అనాది అయిన సంసార సంబంధంచేత ధర్మార్థ కామ పురుషార్థాలలో ఉండే ప్రావణ్యంవల్ల, వాటిని ప్రతిపాదించే వేదభాగాన్ని విచారిస్తున్నాడు. వాటిని విచారించగా, వాటి వల్ల ఏర్పడే ప్రయోజనాలు చాలా అల్పాలు, అస్థిరాలు అనే నిశ్చయం అతనికి కలుగుతున్నది. అప్పుడు, అతడు వేదాంత భాగంలో ప్రతిపాదింపబడిన అర్థం అయిన బ్రహ్మప్రాప్తి అనే మోక్షపురుషార్థంలో ఇంతకు ముందు వేదాధ్యయనం చేసినప్పుడు ఏర్పడిన ఆపాత ప్రతీతిని, (అంటే, బ్రహ్మప్రాప్తిలో కోరిక కలుగగానే, " ఆ బ్రహ్మం యొక్క స్వరూపం ఇటువంటిది, దానిని పొందడానికి ఉపాయం ఇది, బ్రహ్మాన్ని పొంది అనుభవించే ఫలం ఇటువంటిది" – అనే ఇటువంటి విషయాలను) నిశ్చయం చేసుకోవడంకోసం బ్రహ్మవిచారాన్ని ఆరంభిస్తున్నాడు.

శ్రీరామాయణం ఆరంభంకూడా ఇటువంటి సన్నివేశంలోనే జరిగింది. ఆటవికవృత్తిలో రాజసస్వభావుడై ఉండే బుక్షుడనేవానికి కరుణతో మహర్షులు రామనామాన్ని ఉపదేశించి, అతనిని వాల్మీకిగా మార్చారు. అడవిలో నివసిస్తూ తన కుటుంబపోషణ మాత్రమే పరమప్రయోజనంగా పూర్వం గడిపిన బుక్షుడు తనకు మహర్షులు ప్రసాదించిన రామనామాన్ని జపించడం ఆరంభించాడు. కొంతకాలానికి అతనిపై పెద్ద పుట్ట పెరిగింది. రామనామ జపంలో ఉండే అతనికి ఈ విషయం ఏమీ తెలియదు. ఆ పుట్టపై వరుణుడు వర్షించడం వల్ల ఆ పుట్ట కరగి, ఆ పుట్టనుండి బుక్షుడు బయటపడ్డాడు. వల్మీకమనబడే పుట్టనుండి బయటపడినందున వాల్మీకి అనే పేరుతో అతడు ప్రసిద్ధుడయ్యాడు. ఇది అతనికి రెండవ జన్మ, జ్ఞానజన్మ. రామనామ జపప్రభావంవల్ల అతనిలో ఉండే రాజసస్వభావం తొలగి, సాత్విక ప్రవృత్తి కలిగింది. రామనామాన్ని తెలిసినా, వాల్మీకికి రామునిగూర్చి పూర్తిగా తెలియదు. పరంధాముడు, సర్వజగత్కారణమైన పరమాత్మయే.

లోకరక్షణకోసం అతడు భూమిపై అవతరిస్తాడని విన్నాడు. కానీ, ప్రస్తుతం అతడు ఏ రూపంలో అవతరించాడో తెలియనందున, దానిని వివరంగా తెలుసుకోవాలి – అనే జిజ్ఞాసతో దీనుడై ఉన్నాడు. ఆ సమయంలోనే నారదుడు తన ఆశ్రమానికి రాగా, పరతత్వాన్ని నిరూపించే 16 గుణాలను ప్రస్తావించి, "ఈ గుణాలు కలిగిన మానవుడు ఇప్పుడు ఈ లోకంలో ఎవరు ఉన్నారు? " అని ప్రశ్నించాడు. ఇందువల్ల, వాల్మీకి, , భగవదవతారానికి సంబంధించి తనకు ఇంతకు ముందు ఏర్పడిన ఆపాతప్రతీతిని నిశ్చయం చేసుకోవడంకోసం ఆచార్యలక్షణపూర్తిని కలిగినవాడు, తన ఆశ్రమానికి వచ్చినవాడైన నారదమహర్షిని, తన సందేహాన్నినివృత్తి చేసుకోవడంకోసం జిజ్ఞాసతో ప్రశ్నించాడు. ఈ విధంగా శ్రీరామాయణారంభం విశిష్టాద్వైత సిద్ధాంతానుగుణమైన నేపథ్యంలో ఆరంభమైనది.

## శ్రీభాష్యంలో శ్రీరామాయణ సూక్తుల ఉట్టంకనం

శ్రీభాష్యంలో రెండు శ్రీరామాయణ శ్లోకాలను భగవద్రామానుజులు ప్రస్తావన చేయడం కనిపిస్తుంది. ఈ రెండు విశిష్టాద్వైతతత్త్వాలను వివరించడంలో సహాయపడుతున్నవి.

బాలకాండలోని మొదటి సర్గలో, "దేవమాయేవ నిర్మితా" అనే వాల్మీకి మహాముని సీతను వర్ణించాడు. ఈ శ్లోకం, శ్రీభాష్యంలోని సంధ్యాధికరణంలో "మాయామాత్రం తు కార్త్స్న్యేన అనభివ్యక్తస్వరూపత్వాత్" (3–2–3) అనే సూత్రవ్యాఖ్యానంలో ఉదాహరింపబడింది. "మాయాశబ్దో హ్యాశ్చర్యవాచీ, ' జనకస్య కులే జాతా దేవమాయేవ నిర్మితే' త్యాత్యాదిషు తథా దర్శనాత్. " అనేది అక్కడ శ్రీభాష్యవివరణం. కలలో కనిపించేది అంతా యథార్థమే, అసత్యం కాదు – అనే అర్థాన్ని సమర్థిస్తూ, సూత్రంలో ఉండే "

మాయా" అనే పదానికి అర్థం చెప్పడంకోసం శ్రీరామానుజులు ఈ వాల్మీకిసూక్తిని ఉదాహరించారు. " స్వప్నంలో కనిపించేవి భగవంతునిచేత ఆశ్చర్యాన్ని కలిగించే రీతిలో సృష్టింపబడుతున్నాయి. వానిని, కలను కనేవాడు మాత్రమే, అతడు కలను కనే సమయంలో మాత్రమే, చూడగలుగుతున్నాడు. పై వాల్మీకి సూక్తికి "సీతాదేవి, పరమాత్మయొక్క ఆశ్చర్యకరమైన శక్తి అవతరించినట్లుగా ఉన్నది" అని అర్థం.

విలక్షణత్వాధికరణంలో, శరీరలక్షణాన్ని చెప్పే సమయంలో, " న తు దృష్టాంతభావాత్" (2–1–9) అనే సూత్రవ్యాఖ్యానంలో, " అన్నీ భగవంతునకు శరీరమై ఉన్నాయి" అని వివరించడానికి శ్రుతులనుండి, స్మృతులనుండి పలు ప్రమాణాలను ఉదాహరించే సమయంలో, "జగత్ సర్వం శరీరం తే " (శ్రీరామాయణం– యుద్ధకాండ– 120 –25) అనే వాల్మీకిరామాయణవచనం శ్రీరామానుజులచేత ఉదాహరింపబడింది. ఈ ప్రమాణం శ్రీరామాయణం యుద్ధకాండ చివరిలో ఉన్నది ఇక్కడ ఈ సూక్తిని వ్యాఖ్యానిస్తూ గోవిందరాజాచార్యులవారు "తవ నియమేన ఆధేయం, విధేయం,, శేషభూతం చ. ఇదమేవ హి శరీరలక్షణమ్" అని అనడం గమనించదగినది. రావణుడు మరణించిన తరువాత, రాముడు సీతాదేవి పరిగ్రహించటానికి ఇష్టపడనప్పుడు, సీతాదేవి అగ్నిప్రవేశం చేసినది. అప్పుడు బ్రహ్మ, శివుడు మొదలైన దేవతలు అందరూ ప్రత్యక్షమై, శ్రీరాముని స్తుతించారు. రాముడు తనను మానవునిగానే భావిస్తున్నట్లుగా పలికాడు. అప్పుడు బ్రహ్మ, శ్రీరాముని నారాయణ స్వరూపంగా స్తుతించేటప్పుడు, ఈ సూక్తిని పలికాడు. ఇది, విశిష్టాద్వైతసిద్ధాంతానికి ప్రధానప్రతితంత్రార్థం అనదగిన, భగవంతునకు, చేతనాచేతనాలకు మధ్య ఉండే శరీరాత్మభావాన్ని వివరిస్తున్నది. " భవాన్ నారాయణో దేవః " అని ఆరంభించి, తరువాత తాను వివరించినదానిని సంగ్రహంగా చెప్పడంకోసం, బ్రహ్మ "న తదస్తి త్వయా

వినా", "జగత్ సర్వం శరీరం తే" అని అన్నాడు. " నిన్ను ఆత్మగా లేనిది ఏదీ ఈ లోకంలో లేదు, లోకం అంతా నీకు శరీరమే" అని దీనికి అర్థం. జగత్తులో, అంతటా లోపల, బయట వ్యాపించి, భగవానుడు నియమిస్తున్నాడు. అతడు అన్నిటికీ అంతర్యామి, చేతనాచేతనాలు అన్నీ అతనికి శరీరం– అనేదేకదా, విశిష్టాద్వైతసిద్ధాంతంలో మౌలికమైన అంశం.

ఇక, విశిష్టాద్వైతసిద్ధాంతార్థాలను శ్రీరామాయణం వివరించే క్రమం సంగ్రహంగా తెలుపబడుతున్నది.

**"ప్రాప్యస్య బ్రహ్మణో రూపం ప్రాప్తుశ్చ ప్రత్యగాత్మనః,**
**ప్రాప్త్యుపాయం ఫలం ప్రాప్తేః తథా ప్రాప్తి విరోధి చ,**
**వదంతి సకలా వేదాః సేతిహాసపురాణకాః,**
**మునయశ్చ మహాత్మానో వేదవేదాంతవేదినః"**

1) జీవునిచేత పొందదగినవాడైన పరమాత్మయొక్క స్వరూపం,

2) ఆ పరమాత్మను పొందేవాడైన జీవుని స్వరూపం,

3) పరమాత్మను జీవుడు పొందడానికి తగిన ఉపాయంయొక్క స్వరూపం,

4) పరమాత్మను చేరినందువల్ల జీవుడు పొందే ఫలం,

5) జీవుడు పరమాత్మను చేరడంలో ఎదురయ్యే విరోధి స్వరూపం –

అనే ఈ ఐదు అర్థాలనే అన్ని వేదాలు, వేదాంతాలు, ఇతిహాసాలు, పురాణాలు, వేదవేదాంతాలను తెలిసిన మహాత్ములైన మునులు పలుకుతున్నారు, అని హారీతసంహిత తెలుపుతున్నది. ఈ ఐదు విషయాలకు అర్థపంచకం అని పేరు ఈ అర్థపంచకానికి సంబంధించిన యాథాత్మ్యజ్ఞానాన్ని ముముక్షువైనవాడు తెలిసినవాడై ఉండాలి ఇందువల్ల,

వేదాలైనా, ఆ వేదాల అర్థాలను ఉపబృంహణం చేసే ఇతిహాస, పురాణాలు అయినా, అన్నీ కూడా, ఈ అర్థపంచకాన్ని వివరించడంకోసమే ప్రవర్తించాయి.

వేదాంతాల అర్థాన్ని నిర్ణయం చేయడంకోసం ప్రవర్తించినది, నాలుగు అధ్యాయాలను కలిగినది అయిన శారీరక మీమాంసా శాస్త్రంకూడా ఈ ఐదు విషయాలను తెలుపడంకోసమే ప్రవర్తించింది. అందులో, మొదటి రెండు అధ్యాయాలలో పరమాత్మ స్వరూపం, జీవస్వరూపం, చివరి రెండు అధ్యాయాలలో ఉపాయస్వరూపం, విరోధిస్వరూపం, ఫలస్వరూపం తెలుపబడ్డాయి. ఇవి అన్నీ, ఇంతకు ముందు తెలిపిన రీతిలో విశిష్టాద్వైత సిద్ధాంతక్రమంలో నిర్ణయింపబడ్డాయి– అని భగవద్రామానుజ సిద్ధాంతానుయాయుల వివరణం.

వాల్మీకిమహర్షి, బ్రహ్మ అనుగ్రహంవల్ల శ్రీరామాయణాన్ని రచించి పూర్తిచేసిన తరువాత, దానిని లోకంలో ప్రచారం చేయడంకోసం కుశలవులకు దానిని నేర్పించాడు. ఆ సందర్భాన్ని శ్రీరామాయణం తెలుపుతూ,

**"వేదోపబృంహణార్థాయ తా వగ్రాహయత ప్రభుః"**

(వేదార్థాలను ఉపబృంహణం చేసే శ్రీరామాయణాన్ని లోకంలో ప్రచారం చేయడంకోసం వాల్మీకి మహర్షి కుశలవులను తనకు శిష్యులుగా స్వీకరించాడు) అని అన్నది. అందువల్ల శ్రీరామాయణం వేదంలో ప్రతిపాదింపబడిన అర్థపంచకాన్ని వివరించే ఇతిహాసమని ఆ శ్రీరామాయణమే స్వయంగా తెలిపింది. దీనివల్ల శ్రీరామాయణ రచనలో వాల్మీకి మహర్షికి ప్రధానమైన ఉద్దేశ్యం, పైన తెలిపిన అర్థపంచకాన్ని వివరించడమే – అనేది సువ్యక్తం అవుతున్నది.

## శ్రీరామాయణంలో విశిష్టాద్వైతం

ఇంతకు ముందు ప్రస్తావించిన రీతిలో, భగవద్రామానుజ సంప్రదాయానికి సంబంధించిన పూర్వాచార్యులు అందరూ శ్రీరామాయణాన్ని అర్థపంచక ప్రతిపాదక గ్రంథంగా దర్శించి, అందులో ఆ అర్థపంచకం ప్రతిపాదింపబడిన క్రమాన్ని తమ గ్రంథాలలో వ్యాఖ్యానాలలో శ్రీరామాయణ సూక్తులను వివరించడంద్వారా విశదం చేశారు.

## 1. పరస్వరూపమ్

శ్రీపిళ్ళైలోకాచార్యులు అనే శ్రీవైష్ణవసంప్రదాయానికి చెందిన ఆచార్యులు రచించిన తత్త్వత్రయం అనే రహస్యగ్రంథం చిదచిదీశ్వరులనే మూడు తత్త్వాల స్వరూపాన్ని తెలుపుతున్నది. ఆ గ్రంథంలో భగవంతుని స్వరూపం ఈ విధంగా నిర్వచింపబడింది.

భగవానుడు, 1) అఖిలహేయప్రత్యనీకుడు, 2) అనంత జ్ఞానానందైకస్వరూపుడు, 3) జ్ఞానం, శక్తి మొదలైన సకలకల్యాణ గుణగణాలతో భూషితుడు, 4) సకలజగత్తుల సృష్టి స్థితి సంహారాల కర్త, 5) ఆర్తుడు, జిజ్ఞాసువు, అర్థార్థి, జ్ఞాని – అనే నాలుగు విధాలైన పురుషార్థాలను కోరేవారికి ఆశ్రయించదగినవాడు, 6) ఆ విధంగా ఆశ్రయించేవారికి ఆ యా పురుషార్థాలను ప్రసాదించేవాడు, 7) విలక్షణవిగ్రహయుక్తుడు, 8) లక్ష్మీభూమీ నీళానాయకుడు.

పై నిర్వచనంలో తెలుపబడిన లక్షణాలు అన్నీ భగవంతుడైన శ్రీరామునిలో సమన్వయించే క్రమాన్ని శ్రీరామాయణంలో దర్శించవచ్చు.

అఖిలహేయప్రత్యనీకత్వం అంటే, దోషాలను లేకుండా ఉండడం మాత్రమే కాదు, తమస్సుకు తేజస్సువలె, సర్పాలకు గరుడునివలె, దోషాలకు ప్రతిభటంగా ఉండడం – అని అర్థం – అని శ్రీవరవరమునులు దీనిని

వివరించారు. అంటే భగవత్సంబంధం ఉన్న చోట ఏ దోషాలు అయినా, ఎటువంటి దోషాలు అయినా తొలగిపోతాయి– అని అర్థం.

ఉత్తరకాండలో 82 వ స్వర్గ ఇది. తన ఆశ్రమంనుండి అనుజ్ఞను తీసుకొని బయలుదేరుతున్న శ్రీరాముని ఉద్దేశించి అగస్త్యుడు ఈ విధంగా అంటున్నాడు.

**"పావనః సర్వభూతానాం త్వమేవ రఘునందన!, ,**
**పావితాః స్వర్గభూతాశ్చ పూజ్యా స్తే సర్వదేవతైః,**
**యే చ త్వాం ఘోరచక్షుర్భిః పశ్యంతి ప్రాణినో భువి,**
**హతా స్తే యమదండేన సద్యో నిరయగామినః,**
**ఈదృశః త్వం రఘుశ్రేష్ఠ! పావనః సర్వదేహినామ్,**
**భువి త్వాం కథయంతోఽ పి సిద్ధిమేష్యంతి రాఘవ!"**

శ్రీరామా! సమస్తప్రాణులలోనూ నీవే పావనుడవు. ఈ లోకంలో ఏ ప్రాణులు, యముని దండంచేత కొట్టబడినవారై, శీఘ్రంగా నరకానికి పోతున్నారో, అటువంటివారుకూడా తమ ఘోరమైన నేత్రాలతో నిన్ను దర్శిస్తే, వారు సమస్తదేవతలచేత పూజించదగినవారు, పరమపావనులు అవుతున్నారు. స్వర్గప్రాప్తిని పొందినవారవుతున్నారు. ) అని అన్నాడు.

ఈ వచనాలు, పైన తెలిపిన అఖిలహేయప్రత్యనీకత్వ వివరణాన్ని శ్రీరామునిలో విశదపరుస్తున్నాయి. ఇక్కడ పావనశబ్దానికి పాపనివర్తకుడు – అని అర్థం.

భగవంతుని శాపవిమోచకత్వ స్వభావాన్ని శివుని చేతికి అంటుకున్న బ్రహ్మకపాలం భగవదనుగ్రహంవల్ల తీరిన వృత్తాంతం మొదలైనవి స్పష్టం చేస్తున్నాయి. శ్రీరాముని పాపనివర్తకత్వస్వభావాన్ని అహల్యాశాపవిమోచన

వృత్తాంతంలో దర్శించవచ్చు. గౌతముని శాపవశంచేత, నిరాహారంగా అచేతనప్రాయగా పడి ఉన్న అహల్య, శ్రీరాముని చరణస్పర్శతో పాపం తొలగినదై, పవిత్రురాలు అయినది.

శ్రీరామునిలో ఈ అపహతపాప్మత్వగుణం ఇంకా చాలా చోట్ల ప్రకాశించింది. అరణ్యకాండలో చివర (74–13) శబరి పలికిన,

**"చక్షుషా తవ సౌమ్యేన పూతాస్మి రఘునందన!"**

(శ్రీరామా! సౌమ్యమైన నీ కటాక్షంతో నేను దోషాలు తొలగినదాననై, పవిత్రురాలను అయ్యాను) అనే సూక్తి ఇక్కడ ఇంకొక ప్రమాణం.

(ఈ ప్రసంగంలో ఇక్కడ గమనించదగిన విశేషం ఏమంటే, శ్రీపరాశరభట్టర్ తమ సహస్రనామస్తోత్రవ్యాఖ్యానంలో ప్రస్తావించిన ఈ ప్రమాణపాఠం

**"తవాహం చక్షుషా సౌమ్య! పూతా సౌమ్యేన మానద!"**

అని ఉన్నది. ఈ విధంగా, పూర్వాచార్యులు ప్రమాణీకరించిన శ్రీరామాయణ ప్రమాణపాఠాలకు, ఇప్పుడు లభిస్తున్న పాఠాలకు చాలా చోట్ల వ్యత్యాసం కనబడుతున్నది. )

ఇక్కడ, మరొక విశేషం ఏమంటే, శ్రీరామాయణభూషణ వ్యాఖ్యానకారులైన గోవిందరాజాచార్యులవారి కాలం నాటికే ఈ పాఠంలో తేడా ఉండడం. వారు, ఈ ప్రమాణంచేత పూర్వాఘవినాశం చెప్పబడినదని అన్నారు. ఈ శ్లోకానికి సంబంధించిన ఉత్తరార్ధంలోని

**"గమిష్యామ్యక్షయాన్ లోకాన్ త్వత్ప్రసాదాదరిందమ!"**

అనే చోట గల "అరిందమ!" అనే సంబోధనద్వారా ఉత్తరాఘాసంశ్లేషం చెప్పబడినదని కూడా వారు తెలిపారు.

శ్రీరామాయణంలోని "రామమేవానుపశ్యంతో నాభ్యహింసన్ పరస్పరమ్" (యుద్ధకాండ– 131 –95) మొదలైన ఇంకా పలు ప్రమాణాలలో శ్రీరాముని అపహతపాప్మత్వగుణం ఉపబృంహణం చేయబడింది.

ఈ స్వభావాన్ని దివ్యసూరులుకూడా మాటిమాటికి అనుసనంధిస్తారు. శ్రీశఠకోపసూరి ఈ గుణాన్ని స్వరూప గతంగా పలుకుతూ, "పావనాశనై" (శాపాలను నివర్తింప జేసేవాడు) (తిరువాయ్ మొళి–3–6–3) అని అన్నారు. ఈ సూక్తిని వ్యాఖ్యానిస్తూ శ్రీవైష్ణవపూర్వాచార్యులు పై శ్రీరామాయణ సూక్తిని ప్రమాణంగా ఉదాహరించారు. అంతే కాకుండా, శ్రీరాముడు చేతిలో కోదండాన్ని ధరించిన సన్నివేశాన్ని చూస్తే, ఆ దర్శనం వల్ల అందరి పాపం నశించిపోతుంది" అని వివరించారుకూడా. శ్రీరాముని అఖిలహేయప్రత్యనీకత్వాన్ని వివరించే ఇటువంటి ఉదాహరణలు ఇంకా చాలా ఉన్నాయి.

## 2. అనంత జ్ఞానానందైక స్వరూపత్వం

భగవంతుని జ్ఞానానందైక స్వరూపత్వం అంటే, అతడు ఆనందరూపమైన జ్ఞానాన్ని కలిగినవాడై ఉండడం. అంటే, అనుకూలమైన జ్ఞానమే స్వరూపాన్ని కలిగినవాడు – అని తాత్పర్యం. ఉపనిషత్తు భగవానుని "రసో వై సః" అని రసస్వరూపునిగా తెలిపింది. రసస్వరూపుడంటే,

ఆనందస్వరూపుడే. ఆ విధంగానే, "ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్" అని అంటూ ఉపనిషత్తు భగవంతుని ఆనంద స్వరూపాన్ని తెలియజేసింది.

శ్రీరాముని ఆనందస్వరూపత్వాన్ని రాముడనే అతని నామమే చెబుతున్నది. " రమయతీతి రామః" అని మొదలైన రామనామ నిరుక్తులు శ్రీరాముని ఆనందస్వరూపాన్ని తెలుపుతున్నాయి. గోదాదేవికూడా ఈ రామనామాన్ని " మనత్తుక్కినియాన్" అని ద్రావిడీకరిస్తూ అనుసంధించింది. మనసులో రామనామాన్ని అనుసంధించినా, రామరూపాన్ని భావించినా, ఆ అనుసంధానం, ఆ భావన ఆనందమయంగా ఉంటుందని తెలిపింది.

వాల్మీకి అడిగిన ప్రశ్నకు సమాధానం చెబుతూ, నారదుడు "ఇక్ష్వాకువంశప్రభవో రామో నామ జనైః శ్రుతః" అని ఆరంభించి శ్రీరామగాథను సంగ్రహంగా తెలియజేశాడు. ఈ సందర్భంలో ఉండే రామశబ్దాన్ని వ్యాఖ్యానించే గోవిందరాజులవారు ఆగస్త్య సంహితలోని

**"రమంతే యోగినో ఽ నంతే సత్యానందే చిదాత్మని,**
**ఇతి రామపదేనాసౌ పరం బ్రహ్మాభిధీయతే"**

అనే ప్రమాణాన్ని ఉదాహరించి, రాముని ఆనందమయత్వాన్ని తెలిపారు. బ్రహ్మవేత్త అయిన వశిష్ఠుడుకూడా సాక్షాత్తు ఆనందమయుడైన పరమాత్మయే దశరథపుత్రుని రూపంలో అవతరించాడని తెలిసినవాడు కనుకనే, అతనికి రాముడనే నామకరణాన్ని చేశాడు.

శ్రీరామాయణంలో, రాముని ఆనందస్వరూపత్వాన్ని తెలిపే సందర్భాలను మనం ఇంకా పెక్కు చోట్ల గమనించవచ్చు. వాల్మీకిమహర్షి పలు సందర్భాలలో రామనామాన్ని ప్రయోగించడంద్వారా దీనిని సూచించారు.

## శ్రీరామాయణంలో విశిష్టాద్వైతం

రామనామానికి "రమతే ఇతి రామః" – ఆనందించేవాడు– అనే అర్థాన్నికూడా చెప్పవచ్చు. ఈ విధంగా అర్థాన్ని గ్రహించడంవల్ల ఈ నామం శ్రీరామునకు స్వరూప నిరూపకనామం అవుతున్నది. కనుక, ఈ వ్యుత్పత్తి రాముని ఆనంద స్వరూపాన్ని తెలుపుతుంది. " రామో నామ జనైః శ్రుతః " అనే నారదసూక్తిలోని రామనామం తనిశ్లోకివ్యాఖ్యానంలో, మొదట గుణపరంగా వివరింపబడి, తరువాత, స్వరూపపరంగా వ్యాఖ్యానింపబడేటప్పుడు, పైన ఉదాహరించిన అగస్త్యసంహితావచనం ప్రమాణీకరింపబడింది. దీనిని పురస్కరించుకొని శ్రీరామాయణంలోని కొన్ని సందర్భాలను గమనిస్తే, శ్రీరాముని ఆనందస్వరూపత్వాన్ని దర్శించవచ్చు.

భక్తుల కార్యాలను నిర్వహించి పూర్తి చేసి, మనస్సులో ఆనందించేవాడు శ్రీరాముడు. ఈ విషయాన్ని వాల్మీకి

"గుహేన సహితో రామః" – గుహునితో కూడినవాడై, రాముడయ్యాడు, గుహునితో కలసి, తన ఆనందస్వరూపత్వాన్ని వ్యక్తం చేశాడు,

"అభిషిచ్య చ లంకాయాం రాక్షసేంద్రం విభీషణమ్, కృతకృత్యః తదా రామః" –

(రాక్షస ప్రభువు అయిన విభీషణుని లంకలో పట్టాభిషిక్తుని చేసి, కృతకృత్యుడై అప్పుడు రాముడయ్యాడు) అని మొదలైన శ్రీరామాయణంలోని ప్రయోగాలను దీనికి ఉదాహరణంగా చెప్పవచ్చు.

# 3. జ్ఞానం, శక్తి మొదలైన సకలకళ్యాణగుణాలతో కూడినవాడై ఉండడం

భగవంతునకు జ్ఞానం, శక్తి మొదలైన ఆఱు గుణాలు ప్రధానమైనవి.. ఇవి దివ్యాత్మగుణాలు. ఇవి ప్రధానంగా ఆఱు అయినప్పటికీ, ఈ గుణాలనుండి ఉద్భవించిన గుణాల సంఖ్యకు, మహిమకు అంతు లేదు. కనుక, భగవానుని గుణాలు అన్నీ అంతు లేని సంఖ్యను, వైభవాన్ని కలిగినవి. స్వరూపానికి సంబంధించినవి, కనుక, సహజమైనవి, నిస్సమాభ్యధికమైనవి, ఏ దోషాలు లేనివి.

శ్రీరాముని సమస్తకళ్యాణగుణాకరత్వం శ్రీరామాయణం ఆరంభంలోనే, " కో న్వస్మిన్ సాంప్రతం లోకే గుణవాన్" అని ఆరంభించి వాల్మీకి అడిగిన ప్రశ్నవల్ల, దానికి సమాధానంగా నారదుడు పలికిన వచనాలవల్ల స్పష్టమవుతున్నది. అయోధ్యాకాండ ఆరంభంలో, అయోధ్యాపౌరులు దశరథునితో పలికే

" బహవో నృప! కళ్యాణగుణాః పుత్రస్య సంతి తే"

(రాజా! నీ పుత్రుడైన శ్రీరామునకు ఎన్నో కళ్యాణ గుణాలు ఉన్నాయి) అని మొదలైన వచనాలలో శ్రీరాముని సకలకళ్యాణ గుణాకరత్వం తెలుపబడింది. ప్రత్యేకించి, అయోధ్యాకాండలో, శ్రీరాముని కళ్యాణగుణాలు విశేషంగా ప్రతిపాదింపబడ్డాయి – అనిగోవిందరాజీయవ్యాఖ్య.

కిష్కింధాకాండలో తార పలికిన " ధాతునామివ శైలేంద్రో గుణానా మాకరో మహాన్" (ధాతువులకు గొప్ప పర్వతంవలె, గొప్ప గుణాలకు రాముడు ఆకరం) అనే సూక్తికూడా శ్రీరాముని కళ్యాణగుణాకరత్వాన్ని నిరూపిస్తున్నది.

ఇక్కడ, ఇంకొక విశేషం కూడా ఉన్నది. వాల్మీకి మహర్షి శ్రీరామాయణం ఆరంభంలో 16 గుణాలను ప్రస్తావించి పలుకుతూ, "ఈ గుణాలు అన్నిటిని కలిగిన నరుడు ఇప్పుడు ఈ మానవలోకంలో ఎవరైనా ఉన్నారా? " అని నారద మహర్షిని అడిగినప్పుడు, ఆ మహర్షి, దానికి సమాధానంగా శ్రీరామగాథను క్లుప్తంగా తెలియజేశాడు. ఆ తరువాత, ఆ చరిత్రనే వాల్మీకి మహర్షి, బ్రహ్మ ఇచ్చిన వరంవల్ల, ప్రత్యక్షసమానాకారంగా మానసికంగా దర్శించి, శ్రీరామాయణదివ్యగ్రంథాన్ని రచించాడు. ఇందువల్ల ఎక్కడ ఏమి అర్థం అవుతున్నది? అని అంటే, శ్రీరామాయణం అంతా, వాల్మీకి అడిగిన 16 ప్రశ్నలకు సమాధానరూపమే – అని. ఇందువల్ల, శ్రీరామాయణం అంతా శ్రీరాముని సమస్తకల్యాణ గుణాకరత్వాన్ని నిరూపించే గ్రంథం– అని స్పష్టమవుతున్నది ఈ అంశాన్ని దృష్టిలో పెట్టుకొని, కాంచీనగరానికి చెందిన, కీర్తిమూర్తులు, మహావిద్వాన్ ప్రతివాది భయంకరం శ్రీమాన్ అణ్ణంగరాచార్యస్వామివారు "అపూర్వరామాయణమ్" అనే ఒక అద్భుతమైన ద్రావిడ గ్రంథాన్ని రచించారు.

శ్రీరాముడు సకలకళ్యాణ గుణాలను కలిగి ఉన్నాడని శ్రీరామాయణం తెలిపిన క్రమాన్నికూడా ఇక్కడ గమనించాలి.

వేదం, "భగవంతుడు కల్యాణగుణాలను కలిగినవాడు" అని తెలిపేటపుడు " పరాస్య శక్తిః వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞానబలక్రియా చ" (ఈ పరమాత్మకు గల శక్తి అనేక విధాలయినది, సహజమైనది – అని వేదంలో వినబడుతున్నది. భగవంతునకు కల జ్ఞానం, బలం, క్రియ మొదలైన మిగిలిన గుణాలు కూడా ఈ విధంగానే అనేక విధాలైనవి, సహజమైనవి) అని అన్నది. ఇందువల్ల, భగవంతుని కల్యాణగుణాలు అన్నీ కూడా, ఈ లోకంలో జీవులలో కనిపించే గుణాలవలె, ఆగంతుకాలు, అనిత్యాలు కావు. సహజమైనవి – అని చెప్పినట్లయినది. ఇందువల్ల, పరమాత్మప్రతీతి ఎల్లప్పుడు సవిషయంగానే

ఉంటుంది – అని తెలుస్తున్నది. భగవద్రామానుజులు శ్రీభాష్యంలోని మహాసిద్ధాంతం ఆరంభంలో " కేనచిద్విశేషేణ ఇదమిత్థమితి హి సర్వా ప్రతీతి రుపజాయతే" (ఏదో ఒక విధమైన విశేషంతోనే " ఈ వస్తువు ఇటువంటిది " అనే జ్ఞానం అన్ని వస్తువుల విషయంలోనూ కలుగుతున్నది) అని జ్ఞానం అంతా సవిశేషమే – అని అన్నారు.

ఈ అర్థాన్నే శ్రీరామాయణం ఆరంభంలోని "గుణవాన్" అనే పదం తెలుపుతున్నది. "గుణవాన్" అనే ఈ పదానికి "ప్రశస్తమైన గుణాలను కలిగినవాడు" అని అర్థం. ప్రశస్తమైన గుణాలను కలిగి ఉండడం అంటే, ఆ గుణాలను సహజంగా కలిగి ఉండడమే. అంటే, అవి ఏదో ఒక ఉపాధి వల్ల ఏర్పడినవై, ఆగంతుకాలు కాకుండా, వాటిని నిత్యంగా కలిగి ఉండడం. ఈ అర్థాన్నే కదా వేదం " స్వాభావికీ" అనే పదం తెలిపింది.

## 4. సకలజగత్తుల సృష్టి స్థితి లయనిర్వాహకుడు

వేదాంతం, పరమాత్మ స్వరూపాన్ని నిరూపించే లక్షణాన్ని " యతో వా ఇమాని భూతాని జాయంతే, యేన జాతాని జీవంతి, యత్ ప్రయంత్యభిసంవిశంతి, తత్ విజిజ్ఞాసస్వ తత్ బ్రహ్మేతి" (ఏ తత్వంనుండి కంటికి కనిపించే ఈ చరాచరవస్తువులు పుడుతున్నాయో, ఈ విధంగా జన్మించిన ఇవి ఎవరివల్ల జీవిస్తున్నాయో, ఇవి ఎవరిలో లీనం అవుతున్నాయో, ఆ తత్వాన్ని బ్రహ్మంగా తెలుసుకో) అని ఉపదేశించింది. మనుస్మృతి "అప ఏవ ససర్జాథౌ తాసు వీర్య మపాసృజత్" (భగవానుడు ముందుగా కారణజలాన్ని సృష్టించాడు, అందులో తన శక్తిని నిక్షేపించాడు) అని జగత్తును సృష్టించినవాడే పరమాత్మ – అని అన్నది. దీనిని అనువదిస్తూ, శారీరక

మీమాంసకూడా పరమాత్మ లక్షణాన్ని " జన్మాద్యస్య యతః" అనే సూత్రంలో, "జగత్తును సృష్టించి, రక్షించి, లయం చేసేవాడే పరమాత్మ" అని తెలిపింది. .

ఈ పరమాత్మలక్షణాన్ని శ్రీరాముని విషయంగా అన్వయించి పలికిన సందర్భం శ్రీరామాయణంలో ఉత్తరకాండలో (104వ సర్గలో) గోచరిస్తున్నది. బ్రహ్మ తన ద్వారా శ్రీరామునకు పంపిన సందేశాన్ని, యముడు, శ్రీరామునకు తెలియజేసే సందర్భంలో–

**"పితామహేన దేవేన ప్రేషితో ఽ స్మి మహాబల!,**
**తవాహం పూర్వసద్భావే పుత్రః పరపురంజయః,**
**మాయా సంభావితో వీర! కాలః సర్వసమాహరః,**
**పితామహశ్చ భగవానాహ లోకపతిః ప్రభుః,**
**సమయస్తే కృతః సౌమ్య! లోకాన్ సంపరిరక్షితుమ్,**
**సంక్షిప్య హి పురా లోకాన్ మాయయా స్వయమేవ హి,**
**మహార్ణవే శయానోప్సు మాం త్వం పూర్వ మజీజనః,**
———
**" పద్మే దివ్యే ఽ ర్కసంకాశే నాభ్యా ముత్పాద్య మామపి,**
**ప్రాజాపత్యం త్వయా కర్మ మయి సర్వం నివేశితమ్"** (4, 5, 7)

(ఓ మహాబలా! నేను, బ్రహ్మచేత నీ దగ్గరకు పంపబడ్డాను. నీకు నేను పూర్వకల్పంలో పుత్రుడను. నీవే, నీ సంకల్పంతో రుద్రునకు అంతర్యామివై, స్వయంగా సమస్తలోకాలను ఉపసంహరించావు. , లోకపతి, ప్రభువు, భగవానుడైన పితామహుడు ఈ విధంగా నీతో చెప్పమని అన్నాడు. "పూర్వం నీవు లోకాలను నీ సంకల్పంతో స్వయంగానే ఉపసంహరించి, ప్రళయార్ణవజలంలో శయనించి ఉన్నావు. అప్పుడు సృష్టికాలం రాగానే, మళ్లీ నన్ను నీవు సృష్టించావు. దివ్యమైన, సూర్యునివంటి కాంతిని కలిగిన నీ

నాభీపద్మంలో నన్ను నీవు సృష్టించి, ఈ లోకాలను సృష్టించే కర్తవ్యాన్ని నాపై పెట్టావు") అని పలికిన వచనాలలో శ్రీరాముడు సృష్టి స్థితిలయాలను నిర్వహించే భగవానుడే –అని స్పష్టపడుతున్నది.

## 5. భగవానుడు, ఆర్తుడు, అర్థార్థి, జిజ్ఞాసువు, జ్ఞాని –అనే నాలుగు విధాలైన అర్థిజనాలచేత ఆశ్రయింపబడేవాడు

### ఈ లక్షణం, శ్రీరామాయణంలో శ్రీరామునిలో చక్కగా సమన్వయింపబడింది

ఇది శ్రీరామాయణంలో, శ్రీరామునిలో అనుసంధింపబడిన ప్రసిద్ధ ప్రమాణం ఏమంటే, కిష్కింధాకాండలో (15–19) వాలితో తార రాముని మహిమను ఉద్దేశించి పలికిన –

**"నివాసవృక్షః సాధూనా మాపన్నానాం పరా గతిః,**
**ఆర్తానాం సంశ్రయ శ్చైవ యశస శ్చైకభాజనమ్"**

అనే సూక్తి. ఈ శ్లోకంలోని వృక్ష, గతి, సంశ్రయ అనే పదాలు శ్రీరాముడు అన్ని విధాలైనా అర్థులకు ఉపాయం ఉపేయంకూడా – అనే విషయాన్ని తెలుపుతున్నవి. ఈ పదాలకు ఉపాయపరంగా, ఉపేయపరంగా, రెండు రీతులలో అర్థం గ్రహించే అవకాశం ఉన్నది.

ఈ శ్లోకానికి గోవిందరాజాచార్యులవారు చాలా విశదమైన వ్యాఖ్యానాన్ని అనుగ్రహిస్తూ, ఇందులో చతుర్విధాలైన అర్థులకు శ్రీరాముడు ఆశ్రయించదగినవాడనే విషయం తెలుపబడిందని వివరించారు. ఆ విశేషాలు ఇక్కడ అవశ్యావధేయాలు.

తన ఛాయను అపేక్షించే అనుకూలురైవారికి, భక్తులైనవారికి శ్రీరాముడు నివాసవృక్షం. "శ్రీరాముడు భక్తులకు నివాసవృక్షంవంటివాడు" అని అనకుండా, "శ్రీరాముడు భక్తులకు నివాసవృక్షం" అని అభేదాధ్యవసాయంతో చెప్పడంవల్ల, శ్రీరామునకు, నివాసవృక్షానికి మధ్య ఉండే పరిపూర్ణమైన ఔపమ్యం చెప్పబడినది. వృక్షం, ఏ విధంగా, తనను ఆశ్రయించినవారికి ముందుగా తన నీడను ఇచ్చి, తాపాన్ని పోగొట్టి, ఆ తర్వాత తాను పూసిన పూలను, ఫలించిన ఫలాలను ఇవ్వడంద్వారా వారి సకలేంద్రియాలకు తృప్తిని కలిగిస్తుందో, ఆ విధంగానే, శ్రీరాముడు కూడా, తనను ఆశ్రయించిన భక్తులకు ముందుగా అనిష్టనివృత్తిని కలిగించి, ఆ తరువాత ఇష్టప్రాప్తిని అనుగ్రహిస్తాడు – అని ఇక్కడ చెప్పబడినట్లయినది. "వాసవృక్షం" అని అనకుండా " నివాస వృక్షం" అని అన్నందు వల్ల, లోకంలో ఉండే చెట్టు ఎవరికో కొద్దిమందికి మాత్రమే, కొంతసేపు మాత్రమే, కొంతవరకు మాత్రమే నీడను ఇవ్వగలదు, పూలను ఫలాలను ఇచ్చి తృప్తి పరచగలదు. కానీ, శ్రీరాముడు అనే ఈ నివాసవృక్షం అందరికీ, అన్ని సమయాలలోనూ, అన్ని విధాలుగాను, ఆశ్రయాన్ని ఇచ్చి, వారు కోరిన కోరికలను అన్నిటిని తీర్చగలిగినది – అని సూచించినట్లయినది.

**"వాసుదేవతరుచ్ఛాయా నాతిశీతా న ఘర్మదా,**
**నరకాంగారశమనీ సా కిమర్థం న సేవ్యతే?"**

(మిక్కిలి చల్లగా ఉండనిది, మిక్కిలి వేడిగా ఉండనిది, నరకం అనే అగ్నిని ఉపశమింప చేసేది అయిన వాసుదేవుడనే వృక్షంయొక్క ఛాయను మీరెందుకు ఆశ్రయించడం లేదు?) అని చెప్పబడింది కదా. ఈ ప్రమాణంలోకూడా మిగిలిన నామాలను ఉపయోగించకుండా, వాసుదేవ నామాన్ని ప్రయోగించడంకూడా గమనించదగినది. ఈ

వాసుదేవనామంద్వారా ధ్వనించే భగవంతుని వ్యాప్తి, సకలకళ్యాణ గుణాలు ఇక్కడ స్మరించదగినవి.

శ్రీరాముడు సాధువులకైతే ఇటువంటివాడు. ఇక, ఆపన్నులకు అయితే, "పరా గతిః" . " యోగక్షేమం వహామ్యహమ్" (యోగాన్ని, క్షేమాన్ని నిర్వహిస్తాను) అని చెప్పినట్లుగా, ఆశ్రితుల విషయంలో, వారు ఆశ్రయించిన సమయంనుండి, వారు కోరుకున్న ఫలాన్ని పొందే పర్యంతంగా, అన్ని విధాలుగా ఉండే, వారు నిర్వహించుకోవలసిన కార్యాలను తానే నిర్వహించి, ఆ ఫలాన్ని వారికి కలిగేటట్లు చేస్తాడు– అని దీనివల్ల తెలుస్తున్నది. అందులోనూ, ఆర్తులకు ఇతడు సంశ్రయమై ఉన్నాడు. భగవంతుని ఆశ్రయించినవారిలో ఆర్తులు అనేవారు కొందరు ఉంటారు కదా. వారి విషయంలో అయితే, ఇతడు మిక్కిలి చాలా గొప్ప ఆశ్రయమైనవాడు. వారి సర్వకార్యాలను నిర్వహించేవాడు– అని దీని అర్థం.

(యశస శ్చైకభాజనమ్) ఈ విధంగా ఆశ్రితులకు ఏర్పడిన ఆర్తిని తీర్చడంలో, అపేక్షితాలను ప్రదానం చేయడంలో తనకు సాటి వచ్చేవారు వేరొకరు ఎవరూ లేనివాడు. కనుక, ఈ విషయంలో అద్వితీయమైన కీర్తికి ఆశ్రయమై ఉండేవాడు, అతడు.

ఇక్కడ, గీతలో చెప్పబడిన

**"చతుర్విధా భజంతే మాం జనాః సుకృతినో ఽ ర్జున!,**
**ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ!"**

(భరత వంశంలో పుట్టినవారిలో గొప్పవాడవైన అర్జునా! ఆర్తుడు, జిజ్ఞాసువు, అర్థార్థి, జ్ఞాని –< అని నలుగురు అదృష్టవంతులు. ఎందుకంటే, వారు నన్ను ఆశ్రయిస్తున్నారు) అని చెప్పబడిన నాలుగు విధాలైన అధికారులు చెప్పబడ్డారు. ఏ విధంగా అంటే,

"సాధూనామ్" అనే పదంచేత, జిజ్ఞాసువులైన కైవల్యాన్ని కోరే అధికారులు చెప్పబడ్డారు. "ఆపన్నానామ్" అనే పదంచేత అపూర్వమైన, అంటే, ఇంతకు ముందు తాము పొందని ఐశ్వర్యాన్ని పొందాలని కోరేవారు, "ఆర్తానామ్" అనే పదంచేత ఇంతకు ముందు ఉన్న ఐశ్వర్యాన్ని పోగొట్టుకున్నవారు, "యశసః" ఈ పదంచేత "జ్ఞానీ తు ఆత్మైవ మే మతమ్" (స్వస్వరూప పరస్వరూపాది అర్థపంచక జ్ఞానాన్ని కలిగినవాడు నాకు ఆత్మయే – అని నా అభిప్రాయం) అనే భగవంతుని చేత పొగడబడిన కీర్తిని కలిగినవారు చెప్పబడ్డారని చెప్పవచ్చు. ఇక్కడ మరొక్క గొప్ప విశేషం ఏమంటే, మిగిలిన అధికారులను అందరినీ బహువచనంలో పలికి, ఒక్క జ్ఞానిని మాత్రం ఏకవచనంలో పలకడం వల్ల, అటువంటి జ్ఞాని చాలా దుర్లభుడు – అని కూడా సూచింపబడింది.

శ్రీరామాయణ తనిశ్లోకివ్యాఖ్యానంలో కూడా, ఈ శ్లోకంలో చతుర్విధాలయిన అధికారులకు శ్రీరాముడు గతి, గమ్యం– అనే అర్థం చెప్పబడిందని వ్యాఖ్యానింపబడడాన్ని గమనించవచ్చు.

ఇందువల్ల, ఈ శ్లోకంద్వారా శ్రీరాముడు అన్ని విధాలయిన అధికారులకు ఆశయణీయుడు – అనే ఐదవ లక్షణమే కాకుండా, ఆ యా, అధికారులు కోరిన ఆ యా పురుషార్థాలను వారు కోరిన అవధి కంటే అధికంగా ఇవ్వగలిగినవాడు – అనే భగవానుని ఆరవ లక్షణంకూడా తెలుపబడినట్లయినది.

విశేషించి, శ్రీరాముని మోక్షప్రదాతృత్వం అరణ్యాకాండలోని జటాయువు వృత్తాంతంలోనూ, శరభంగవృత్తాంతంలోనూ, శబరీవృత్తాంతంలోనూ, ఉత్తరకాండలో వర్ణింపబడిన, అయోధ్యలో ఉండే

చరాచరాలకు అన్నిటికి శ్రీరాముడు మోక్షాన్ని ప్రసాదించిన వృత్తాంతంలోనూ స్పష్టం అవుతున్నది.

## 6. దివ్యమంగళ విగ్రహవిశిష్టత్వమ్

ఛాందోగ్యోపనిషత్తు ఆదిత్యమండలాంతర్వర్తి అయిన భగవానుని రూపాన్ని వర్ణిస్తూ, " హిరణ్యకేశః హిరణ్యశ్మశ్రుః, ఆప్రణఖాత్ సర్వ ఏవ సువర్ణః, తస్య కప్యాసం పుండరీకమేవ మక్షిణీ" (అతడు, బంగారువలె ఆకర్షణీయమైన కేశాలను కలిగినవాడు, బంగారు వలె ఆకర్షణీయమైన మీసాలను కలిగినవాడు, కాలి గోళ్ళనుండి శిరస్సు వరకు శరీరంలో అంతటా బంగారువలె ఆకర్షణీయమైన వర్ణాన్ని కలిగినవాడు. అతనికి రెండు నేత్రాలు ఉన్నాయి. అవి రెండు, నిండు నీటిలో, బలమైన కాడలను కలిగిన, సూర్యుని కిరణాలతో అప్పుడే వికసించిన తామర పువ్వులవలె అందమైనవి) అని అంటూ భగవానుడు చాలా ఆకర్షణీయమైన దివ్యమంగళరూపాన్ని కలిగినవాడని అన్నది. ఈ రూపమే. గాయత్రీమంత్ర ప్రతిపాద్యరూపం.

శ్రీరాముడు ఇటువంటి దివ్యమంగళవిగ్రహాన్ని కలిగినవాడు అనే విషయం శ్రీరామాయణంలో మొదటినుండి చివరి వరకు ఎన్నో సందర్భాలలో తెలుపబడింది. శ్రీరామాయణం ఆరంభంలోనే వాల్మీకి అడిగిన ప్రశ్నలలోని " క శ్చైకప్రియదర్శనః?" అనే ఒక ప్రశ్న శ్రీరాముని దివ్యమంగళరూపాన్నిగూర్చి చేసినదేకదా. "రామః కమలపత్రాక్షః సర్వసత్త్వమనోహరః", "చంద్రకాంతాననం రామ మతీవప్రియదర్శనమ్" అని మొదలుగా శ్రీరామాయణంలో కనిపించే ఎన్నో సూక్తులు ఈ సందర్భంలో ప్రమాణాలు. ఈ విషయం సుప్రసిద్ధమైనందున, దీనిని ఎక్కువ వివరించడం లేదు.

# 7. శ్రీభూనీళాదివ్యపత్నీ సమేతత్వమ్

వేదాలలో "వేదేషు పౌరుషం సూక్తమ్" అని చెప్పినట్లుగా, పురుషసూక్తం ప్రధానమైనది. ఇందులో, భగవంతుడు పురుషశబ్దంచేత నిర్దేశింపబడ్డాడు. ఈ సూక్తం, పురుష శబ్దంచేత చెప్పబడే భగవంతుని నుండే ఈ సమస్త జగత్తు ఉద్భవించిందని చెప్పింది.

అటువంటి భగవానుడు ఎవరు? అనే నిర్ణయాన్ని ఈ సూక్తంలోని ఉత్తరానువాకం విశదం చేస్తున్నది. అందులో, ఈ జగత్తుసృష్టికి అంతటికి కారణభూతుడైన పురుషుని ఉద్దేశించి పలుకుతూ, " హ్రీ శ్చ తే లక్ష్మీ శ్చ పత్న్యౌ" అని అంటూ, "ఓ పరమాత్మా! నీకు " హ్రీః "అనే శబ్దంచేత చెప్పబడే భూదేవి, లక్ష్మీదేవి, నీళాదేవి పత్నులు – అని అన్నది. ఇందువల్ల జగత్కారణరూపుడైన పరమాత్మ లక్ష్మీభూనీళాసమేతుడై ఉంటాడని చెప్పబడినట్లు అయినది కదా.

పై సూక్తిలో, శబ్దతః భూదేవి, లక్ష్మీదేవి మాత్రమే చెప్పబడినా, అందులో ఉండే చకారం అనుక్తసముచ్చాయకం కనుక, శబ్దతః చెప్పబడని నీళాదేవి సూచింపబడింది – అని ఆచార్యుల అభిప్రాయం. ఎందుకంటే, ఈ సూక్తిని ఉపబృంహణం చేసే పౌరాణిక శ్లోకంలో–

**"వైకుంఠే తు పరే లోకే శ్రీసహాయో జనార్ధనః,**
**ఉభాభ్యాం భూమినీళాభ్యాం సేవితః పరమేశ్వరః"**

(గొప్పదైన వైకుంఠ లోకంలో లక్ష్మీదేవితో కూడుకొని ఉండే జనార్దనుడైన పరమేశ్వరుడు భూదేవి, నీళాదేవి – అనే ఇద్దరు దేవేరుల చేత సేవింపబడుతూ ఉంటాడు) అని ముగ్గురు దివ్యపత్నులు చెప్పబడడంచేత ఈ శ్రుతిలో కూడా ముగ్గురిని గ్రహించడం యుక్తం. కనుకనే భగవద్రామానుజులవారుకూడా శరణాగతి గద్యలో శ్రీరంగనాథుని

సంబోధిస్తూ, " స్వాభిమత --శ్రీ వల్లభ!" అని ముందు లక్ష్మీపతిత్వాన్ని పలికి, వెనువెంటనే, " ఏవంభూత భూమినీళానాయక!" అని భూనీళాసహితత్వాన్ని కూడా చెప్పారుకదా.

శ్రీరామాయణంలో ఈ విషయం ఎక్కడ సూచింపబడింది? అని అంటే, ఉత్తరకాండ చివరిలో శ్రీరాముని మహాప్రస్థానం వర్ణింపబడే సందర్భంలో, శ్రీరాముడు సరయూనదీ తీరానికి వెళ్లే దృశ్యాన్ని వర్ణించే,

**"రామస్య దక్షిణే పార్శ్వే సపద్మా శ్రీ రుపాశ్రితా,**
**సవ్యే తు హ్రీః మహాదేవీ వ్యవసాయః యథాగ్రతః"**

(109–6) అనే శ్లోకంలో రాముడు భూలక్ష్మీసహితుడై వెళ్లాడని చెప్పబడింది. వేదోపబృంహణాత్మకమైన శ్రీరామాయణంలోని ఈ సూక్తిలో, ఉపలక్షణ ప్రక్రియలో, నీళాదేవి కూడా సూచింపబడింది– అని భావించడంలో అడ్డు లేదు.

వేరొక విధంగాకూడా, ఈ లక్షణాన్ని శ్రీరామునిలో సమన్వయించవచ్చు.

లక్ష్మీదేవి, భూదేవి, నీళాదేవి– అనే ఈ ముగ్గురు భగవంతునకు కల సహస్రాధిక దివ్యపత్నులలో ప్రధానమైనవారు. భగవంతుడు అనేకమంది దివ్యపత్నులను కలిగి ఉన్న విషయాన్ని శ్రీపరాశరభట్టర్ శ్రీగుణరత్నకోశం అనే లక్ష్మీస్తుతిలో,

**"దేవి! త్వా మనునీళయా సహమహీదేవ్యః సహస్రం తథా**
**యాభి స్త్వం స్తనబాహుదృష్టిభి రివ స్వాభిః ప్రియం శ్లాఘసే"**

(ఓ లక్ష్మీదేవీ! భూదేవి నీళాదేవితో పాటుగా వేలాదిమంది భగవంతుని దివ్యపత్నులు, నీవు నీ స్వామితో ఆనందించేటప్పుడు, నీ స్తనాలు, బాహువులు, నేత్రాలవలె ఆనందంగా నీకు తోడై సహకరిస్తారు) అనే సూక్తిలో తెలియజేశారు.

ఇక్కడ, "భగవంతుడు, వేలాదిమంది పత్నులను కలిగి ఉన్నాడు"– అని అనడంలో అర్థం ఏమి? అనే విషయాన్ని కొంచెం గమనించి చూడాలి. భగవంతునకు కల లక్ష్మీదేవి, భూదేవి, నీళాదేవి మొదలైన దివ్యపత్నులు వేరెవరో కాదు. భగవంతునకు కల, లెక్కకు మించిన కళ్యాణ గుణాలే. లక్ష్మీదేవిని కరుణాగుణస్వరూపిణిగా భావించడం జరుగుతున్నది. భూదేవిని క్షమాగుణస్వరూపిణిగా భావించడం జరుగుతున్నది. నీళాదేవిని వాత్సల్య గుణస్వరూపిణిగా భావించడం జరుగుతున్నది. పాంచరాత్రాది ఆగమ శాస్త్రాలు లక్ష్మీదేవి మొదలైన పత్నులను భగవంతుని గుణప్రకారాలుగానే తెలిపినవి. . దేశికులు దయాశతకం ఆరంభంలో, లక్ష్మీదేవి, భూదేవి, నీళాదేవులను భగవంతుని కరుణ, క్షమ, వాత్సల్యం అనే గుణాల మూర్తులుగానే భావించి స్తుతించారు. శ్రీరామాయణంలోని "అనన్యా హి మయా సీతా భాస్కరేణ ప్రభా యథా" అనే శ్రీరాముని వచనం, " అనన్యా రాఘవేణాహం భాస్కరేణ ప్రభా యథా" అనే సీతాదేవి వచనం, సీతాదేవి శ్రీరాముని గుణస్థానీయ అని స్పష్టం చేస్తున్నది. ఇక్కడ ఉపమానోపమేయ భావాన్ని గమనిస్తే, సూర్యునకు కాంతి గుణం అయినట్లే, శ్రీరామునకు సీతాదేవి గుణంవంటిది – అని కదా అర్థం. అందువల్ల సీతాదేవికి చెప్పబడిన భగవద్గుణస్థానీయత్వం శ్రీరామాయణసిద్ధం.

భగవంతుడు శ్రీరాముడై అవతరించినపుడు, లక్ష్మీదేవి సీతాదేవిరూపంలో అవతరించింది. ఆ అవతారంలో ఆమె ప్రధానమహిషి. భగవంతుడు వరాహావతారాన్ని స్వీకరించినప్పుడు భూదేవి ప్రధానపత్ని

అయినది. శ్రీకృష్ణుడై అవతరించినప్పుడు నీళాదేవి ప్రధానమహిషి అయినది. అందువల్లనే, దివ్యసూరులు తమ ప్రబంధాలలో శ్రీకృష్ణుని వర్ణించేటప్పుడు, నీళాదేవి ప్రస్తావననే అధికంగా చేశారు – అని పూర్వాచార్యుల సమన్వయం.

ఇక, శ్రీరామావతార విషయానికి వస్తే, ఆ అవతారంలో కరుణాగుణస్వరూపిణి అయిన లక్ష్మీదేవి ప్రధానం కనుక, ఆ అవతారంలో ప్రధానగుణం కరుణ. అందువల్లనే దేశికులు శ్రీరామావతారంలోని నిరూపకగుణంగా కరుణను పేర్కొంటూ, " కరుణాకాకుత్స్థ" అని దశావతారస్తోత్రంలో, శ్రీరాముని ప్రధాన గుణం కరుణ అని స్తుతించారు.

అయితే, ఇంత మాత్రంచేత, మిగిలిన గుణాలు శ్రీరామునిలో లేవు –అని అర్థం కాదు. అతడు "గుణానా మాకరో మహాన్" కదా. పరమపదనాథుడు శ్రీరాముడై అవతరించినప్పుడు, అతని కరుణాగుణం సీతాదేవిగా అవతరించినప్పుడు, ఆదిశేషుడు లక్ష్మణుడై అవతరించినప్పుడు, భగవంతుని మిగిలిన కళ్యాణ గుణాలుకూడా భగవంతుని అనుసరించకుండా ఉంటాయా? తప్పక అనుసరించి ఉంటాయి కదా. కరుణాగుణం సీతాదేవి రూపంలో స్పష్టంగా ప్రకాశించినా, అంతర్హితంగా అయినా మిగిలిన కళ్యాణ గుణాలు అతని వెంటనంటే ఉంటాయి. శ్రీరాముడు "క్షమాగుణాన్ని కలిగినవాడు "అనే విషయాన్ని శ్రీరామాయణంలోని "క్షమయా పృథివీసమః", "క్షితిక్షమావాన్" అన్ని మొదలైన ప్రయోగాలు, "వాత్సల్యాన్ని కలిగినవాడు " అనే విషయాన్ని "విదితః స హి ధర్మజ్ఞః శరణాగతవత్సలః" అని మొదలైన ప్రయోగాలు స్పష్టం చేస్తున్నాయి.

ఇందువల్ల, ఈ దృష్టిలో చూసినప్పుడు, శ్రీరాముడు, శ్రీభూనీళాసమేతుడు– అని భావించడంలో అడ్డులేదు..

ఇక్కడ, ప్రసంగవశాత్, ఒక విషయం విన్నపింపబడుతున్నది. భగవంతుడు లక్ష్మీదేవితో ఆనందించేటప్పుడు, మిగిలిన దేవేరులు వెంటనే ఉండి, సహకరించడం, వారు కూడా ఆనందించడం అంటే తాత్పర్యం ఏమి? అనేదికూడా ఆలోచించాలి. భగవానుడు, లక్ష్మీదేవి కలసి ఆనందించడం అంటే, ఆశ్రయించిన చేతనుని స్వీకరించి రక్షించి, ఆ చేతనప్రాప్తివల్ల ఆనందించడమే. భగవానుడు తనను ఆశ్రయించిన చేతనుని రక్షించేటప్పుడు ఆవశ్యకమైన గుణాలలో, మూడు గుణాలు ప్రధానంగా చెప్పబడుతున్నాయి. అవి, జ్ఞానం, శక్తి, కరుణ – అనేవి. లక్ష్మీదేవి కరుణాస్వరూపిణి కనుక ఆమెకు పురుషకారస్వరూపిణి రూపంలో ప్రాధాన్యం ఉన్నది. భూదేవి, నీళాదేవులు క్షమాగుణ వాత్సల్యగుణ స్థానీయలు కనుక, ఆ గుణాలు కూడా చేతనరక్షణలో భగవంతుని ప్రోత్సహించి అతనిని రక్షించేటట్లు చేస్తాయి. భగవానుడు తనను ఆశ్రయించిన భక్తునిలోని దోషాలను చూడకుండా, అతనిని స్వీకరించి రక్షించినప్పుడు, లక్ష్మీదేవివలె, భూదేవి, నీళాదేవివంటి మిగిలిన దివ్యపత్నులుకూడా ఆనందించడం అంటే, ఆ పత్నులుగా చెప్పబడే మిగిలిన భక్తరక్షణకు ఆవశ్యకమైన గుణాలు కార్యసిద్ధిని పొందడమే.

ఈ విధంగా శ్రీరామాయణంలో విశిష్టాద్వైతసిద్ధాంత ప్రకారం నిర్వచింపబడిన భగవత్స్వరూపం శ్రీరామునిలో ప్రకాశిస్తున్నది – అని ఏర్పడుతున్నది.

## శ్రియఃపతిత్వమ్

శ్రీవైష్ణవసంప్రదాయంలో భగవంతుని అసాధారణలక్షణాలలో శ్రియఃపతిత్వం చాలా ప్రధానంగా భావించబడుతున్నది. "తిరువుడై అడికళ్ తమ్ నలమ్ కళల్ వణంగి" ( లక్ష్మిని కలిగిన స్వామియొక్క ఆనందప్రదమైన

శ్రీచరణాలను నమస్కరించి), "తిరువిల్లా త్తేవరై త్తేఱేల్ మిన్ తేవు "( లక్ష్మీసంబంధాన్ని లేని అవరదైవాలను పరదైవాలుగా కొలువకండి) ఇత్యాదిగా దివ్యసూరులు విశేషంగా ఈ లక్షణాన్ని అనుసంధించారు.

దీనినికూడా శ్రీరామాయణం శ్రీరాముని విషయంలో –

**" అప్రమేయం హి తత్తేజః యస్య సా జనకాత్మజా"**

( ఆ సీతాదేవి ఎవరికి పత్నియో, ఆ శ్రీరాముని తేజస్సు కొలువడానికి సాధ్యం కానిది) అని అనుసంధించింది.

ఈ లక్షణాలే కాకుండా, మరికొన్ని, భగవంతుని నిరూపించే శాస్త్రోక్తాలైన భగవదసాధారణధర్మాలు కూడా, శ్రీరామాయణంలో శ్రీరామునిలో వర్ణింపబడిన వైనం చాలా మనోహరమైనది. ఆ అంశం సంగ్రహంగా తెలుపబడుతున్నది.

## పరత్వాది పంచకం

"అంభస్య పారే భువనస్య మధ్యే నాకస్య పృష్ఠే మహతో మహీయాన్, శుక్రేణ జ్యోతీంషి సమనుప్రవిష్టః ప్రజాపతి శ్చరతి గర్భే అంతః" అని వేదం, " విణ్ మీదిరుప్పాయ్, మలైమేల్ నిఱ్పాయ్, కడల్ శేర్ ప్పాయ్, మణ్ మీదు ఉఴల్ వాయ్, ఇవత్తుళ్ ఎంగుమ్ మఱైందు ఉఱైవాయ్" (పరమపదంలో ఉంటావు, పర్వతంపై నిలచి ఉంటావు, సముద్రంలో చేరి ఉంటావు, భూమిపై సంచరిస్తావు, ఈ ప్రాణులలో అంతట అంతర్యామివై మరుగుపడి ఉంటావు) అని ఆళ్వారులు భగవంతుని పర, వ్యూహ, విభవ, అంతర్యామి, అర్చాప్రకారాలతో ఐదు విధాలైన రూపాలను నిరూపించారు. వేదాన్ని అనుసరిస్తూ పాంచరాత్రశాస్త్రంకూడా, భగవంతుని పంచవిధరూపాలను.

**"మమ ప్రకారాః పంచేతి ప్రాహు ర్వేదాంతపారగాః,**
**పరో వ్యూహాశ్చ విభవో నియంతా సర్వదేహినామ్,**
**అర్చావతారశ్చ తథా దయాళుః పురుషాకృతిః,**
**ఇత్యేవం పంచథా ప్రాహు ర్మాం వేదాంత విదో జనాః"**

**(విష్వక్సేన సంహిత)**

అని తెలిపింది. వీటిలో, పరరూపం అనేది పరమపదంలో ఉండే రూపం. ఇది, శ్రీరామాయణంలో " తమసః పరమో ధాతా శంఖచక్రగదాధరః" అని మొదలైన సూక్తులలో ప్రస్తావించబడింది.

వ్యూహరూపం అనేది క్షీరాబ్ధిలో ఆదిశేషునిపై శయనించి ఉండే రూపం. ఇది, కిష్కింధాకాండలో వర్షర్తువు వర్ణనను చేసే సందర్భంలో గల "నిద్రా శనైః కేశవ మభ్యుపైతి" (నిద్ర మెల్లిగా కేశవుని పొందుతున్నది) అనే చోట సూచింపబడినది చెప్పవచ్చు. ఇక్కడ తెలుపబడిన తమోమయమైన నిద్ర కాకుండా, లోకరక్షణచింతననుగూర్చి భగవంతుడు చేసే ఆలోచనా రూపమైన యోగనిద్రయే. ఇటువంటి స్థితి వ్యూహమూర్తికే ఉంటుంది కనుక, ఇక్కడ కేశవనామం వ్యూహ రూపాన్ని సూచిస్తున్నదని చెప్పవచ్చు.

మూడవది విభవరూపం. ఇది భగవంతుని పలు అవతారాలను తెలుపుతుంది. శ్రీరామాయణం, సాకల్యంగా, భగవంతుడు శ్రీరాముడై అవతరించిన వృత్తాంతాన్ని తెలుపుతున్నది. ఇంతే కాకుండా, యుద్ధకాండలో గల "ఏకశృంగో వరాహ స్త్వమ్" అనేసూక్తి వరాహావతారం అనే ఇంకొక విభవరూపాన్ని తెలుపుతున్నది.

నాల్గవది అంతర్యామిరూపం. అరణ్యకాండలో మారీచుడు పలికిన "వృక్షే వృక్షే చ పశ్యామి చీరకృష్ణాజినాంబరమ్" (68– 4) సూక్తిలో దీనిని గమనించవచ్చు.

ఐదవది అర్చారూపం. దీనిని అయోధ్యాకాండలోని "సహ పత్న్యా విశాలాక్ష్యా నారాయణ ముపాగమత్" అనే సూక్తిలో చూడవచ్చు. ఇక్కడ చెప్పబడిన నారాయణుడు ఈ నాడు అందరికీ శ్రీరంగంలో దర్శనాన్ని అనుగ్రహిస్తున్న శ్రీరంగనాథుడే – అని శ్రీవైష్ణవసంప్రదాయకథనం.

ఈశ్వరస్వరూపానికి సంబంధించిన ఇంకా పలు విశేషాలు శ్రీరామాయణంలో గోచరిస్తూ ఉన్నప్పటికీ, వ్యాసవిస్తరణ భీతివల్ల ఈ విషయాన్ని ఇంతటితో విరమించి, అర్థపంచకంలో వేరొక అంశం అయిన జీవస్వరూపాన్నిగూర్చి శ్రీరామాయణం ఏ విధంగా తెలియజేసిందో, ఆ విషయం తెలుపబడుతున్నది.

## శ్రీరామాయణంలో జీవస్వరూపనిరూపణం

విశిష్టాద్వైత సిద్ధాంతానుసారం, జ్ఞానానంద స్వరూపుడైన జీవుడు పరమాత్మకు శేషభూతుడు, ఒకనికి ఒక వస్తువు శేషంగా ఉండడం అంటే, చందన కుసుమతాంబూలాదులనువలె, శేషి ఆ వస్తువును తన ఇష్టానుసారంగా వినియోగించుకోగలిగేటట్లుగా ఉండడమే. ఈ విధంగా భగవంతుని విషయంలో జీవునకుండే శేషత్వం అనేది శాస్త్రసిద్ధం. దీనిని "యస్యాస్మి న తమంతరేమి" (ఎవనికి నేను శేషమై ఉన్నానో, ఆ భగవానుని నేను విడచి ఉండను) అనే శ్రుతివాక్యం,

**"దాసభూతాః స్వతః సర్వే హ్యాత్మానః పరమాత్మనః,**
**నాన్యథా లక్షణం తేషాం బంధే మోక్షే తథైవ చ"**

(ఆత్మలు అందరూ పరమాత్మకు దాసభూతులు, వారికి వేరొక లక్షణం ఏమీ ఈ సంసారంలో కానీ, మోక్షంలో కానీ లేదు. అన్నిచోట్ల వారు భగవంతునకు శేషభూతులే) అని మొదలైన స్మృతులు తెలుపుతున్నాయి.

దీనిని శ్రీరామాయణం –

**"పరవానస్మి కాకుత్స్థ! త్వయి వర్షశతం స్థితే"**

(శ్రీరామా! నేను నీకు ఎప్పటికీ శేషభూతుడనే) అనే లక్ష్మణ వచనం ద్వారా తెలిపింది.

భగవంతుని విడచిన చేతనాచేతనాలకు వేటికీ అస్తిత్వం సిద్ధించదు. ఎందుకంటే, ఆ పరమాత్మయేకదా, వాటికి ఆత్మ. ఈ విషయాన్ని శ్రీరామాయణం –

**"న చ సీతా త్వయా హీనా న చాహమపి రాఘవ,**
**ముహూర్తమపి జీవావ జలాన్మత్స్యా వివోద్ధృతౌ"**

(రాఘవా! నీటినుండి బయటపడిన చేపలవలె, నేను కానీ, సీతాదేవి కానీ, నిన్ను విడచి ఒక్క క్షణం కూడా బ్రతికి ఉండలేము) అనే లక్ష్మణవచనం ద్వారా తెలిపింది.

ఈ రెండు, ఆత్మలు అన్నీ భగవంతునకు శేషమై, ధార్యమై, ఉంటాయి అని విశిష్టాద్వైత సిద్ధాంతాన్ని నిరూపిస్తున్నాయి.

జీవునకు చెప్పబడిన, ఈ శేషత్వలక్షణం శ్రీరామాయణంలో లక్ష్మణునిలో దర్శించవచ్చు.

**"బాల్యాత్ ప్రభృతి సుస్నిగ్ధో లక్ష్మణో లక్ష్మివర్ధనః"**

(శ్రీరామునకు సేవను చేయడం అనే సంపదలో వృద్ధిని కలవాడైన లక్ష్మణుడు చిన్నతనం నుండే శ్రీరాముని విషయంలో మిక్కిలి స్నేహాన్ని కలిగి ఉండేవాడు) ,

**"భవాంస్తు సహ వైదేహ్యా గిరి సానుసు రంస్యతే,**
**అహం సర్వం కరిష్యామి జాగ్రతః స్వపత శ్చ తే"**

(శ్రీరామా! నీవు సీతాదేవితో కలిసి పర్వత చరియలలో విహరిస్తావు. అప్పుడు నీకు నేను, నీవు నిద్ర పోతున్నప్పుడు, మెలకువగా ఉన్నప్పుడు అన్ని విధాలయిన సేవలను చేస్తాను) ,

**"కురుష్వ మా మనుచరం వైధర్మ్యం నేహ విద్యతే,**
**కృతార్థోఽ హం భవిష్యామి తవ చార్థః ప్రకల్పతే"**

(శ్రీరామా! నన్ను నీవు నీ అనుచరునిగా చేసుకో. ఈ విషయంలో ఏ విధమైన విరుద్ధ ధర్మం లేదు. దీనివల్ల నేను కృతార్థుడను అవుతాను. అంతే కాకుండా, నీకుకూడా ప్రయోజనం సిద్ధిస్తుంది) అని మొదలైన లక్ష్మణవాక్యాలలో ఈ లక్షణం నిరూపింపబడింది.

ఈ శేషత్వలక్షణ నిరూపణలో శ్రీరామాయణంలో ఒక విశేషం ఉన్నది. జీవుడు భగవంతునకు శేషభూతుడై ఉండడం – అనేది జీవస్వరూపంలో అంతర్భవించినది అయినప్పటికీ, ఈ శేషత్వస్వరూపం అనేది స్వరూపకృత దాస్యంవల్ల ఏర్పడే శేషత్వం, గుణకృతదాస్యంవల్ల ఏర్పడే శేషత్వం – అని రెండు విధాలుగా ఉంటుంది. అంటే, శేషి విషయంలో శేషభూతుడు దాస్యం చేయడం అనేది శేషభూతుని స్వరూపంలో చేరినది అయినా, ఆ దాస్యం స్వరూప ప్రయుక్తం కావడంతో పాటు, శేషిలో ఉండే గుణాలను ఆశ్రయించికూడా ప్రవర్తించినది అయినట్లయితే, ఆ దాస్యం ఆనందాన్ని కలిగిస్తుంది. ఇంకా ఇంకా ఎక్కువగా ఎల్లప్పుడూ దాస్యాన్ని చేయాలి – అనే అభిలాషను శేభూతునకు కలిగిస్తుంది. అయితే, ఈ క్రమంలోని దాస్యం లోకంలో భార్య, బిడ్డలు, తల్లిదండ్రులు, స్నేహితులు మొదలైన ప్రాకృత సంబంధ విషయంలో ఉన్నప్పటికీ, అది నిత్యమూ కాదు, స్వరూపానికి తగినదికూడా కాదు. అందువల్ల, జీవునకు భగవంతుని

విషయంలో స్వరూపంవల్ల సిద్ధించిన ఈ దాస్యం అనేది గుణకృతంగాకూడా అయితే, అంటే, భగవంతుని కల్యాణగుణాలను చూచి, ఆకర్షింపబడినవాడై, భగవంతుని పట్ల ప్రీతితో చేస్తే, ఆ దాస్యం అంతు లేని ఆనందాన్ని కలిగిస్తుంది. అందువల్లనే, శ్రీవైష్ణవసంప్రదాయంలో దాస్యం అనేది భగవదనుభవజనిత ప్రీతికారితమై ఉండాలి – చెప్పబడింది.

ఈ విశేషాన్ని శ్రీరామాయణం –

**"అహమస్యావరో భ్రాతా గుణైః దాస్యముపాగతః"**

(నేను ఈ శ్రీరామునకు తమ్ముడను, ఇతని సద్గుణాలకు దాసుడను అయ్యాను) అనే లక్ష్మణ వాక్యంద్వారా తెలిపింది. ఇక్కడ, శ్రీరామునకు లక్ష్మణుడు తమ్ముడు కనుక, ఆ సంబంధాన్నిబట్టి శ్రీరామునకు లక్ష్మణుడు దాసుడు కావడం అనేది సంబంధప్రయుక్తం, అంటే, స్వరూప ప్రయుక్తం.. కానీ, ఇక్కడ లక్ష్మణుడు అంతమాత్రమే చెప్పి ఊరుకోకుండా, " శ్రీరాముని కళ్యాణ గుణాలకు వశుడనై, నేను అతనికి దాసుడను అయ్యాను" అని అన్నాడు. ఈ రీతిలో స్వరూపకృతదాస్యం గుణకృతదాస్యంకూడా అయితే, అది పరిపూర్ణమైన ఆనందానికి కారణం అవుతుంది – అని ఇక్కడ తెలుపబడినట్లు అయినది.

జీవుని వేరొక లక్షణం అయిన భగవత్పారతంత్ర్యం అనేదానిని శ్రీరామాయణం భరతుని ద్వారా నిరూపించింది.

లక్ష్మణుడు శ్రీరామునకు శేషభూతుడై, అతడు మెచ్చిన దాస్యాన్ని చేసినప్పటికీ, అతనిలో, జీవచైతన్యప్రయుక్తమైన కించిత్తు స్వాతంత్ర్యగ్రంధం గోచరిస్తుంది. శ్రీరాముని వెంట తానుకూడా అరణ్యానికి వస్తానని లక్ష్మణుడు అన్నప్పుడు, రాముడు అతనిని అయోధ్యలోనే ఉండి, తల్లిదండ్రులకు సేవ చేయమని అన్నాడు. అయినా, , లక్ష్మణుడు శ్రీరాముని మాటను వినకుండా

అతనిని నిర్బంధించి, శ్రీరాముని వెంట అరణ్యాలకు వెళ్లాడు. కానీ, భరతునిలో ఈ మాత్రం స్వాతంత్ర్యంకూడా కనిపించదు. అచిత్తువలె పరతంత్రమై ఉండడం – అనే పారతంత్ర్య లక్షణపూర్తి భరతునిలో మూర్తీభవించింది. తన ప్రార్థనను శ్రీరాముడు నిరాకరించినా, ఆ శ్రీరాముని ఆజ్ఞను అనుసరించి, అతడు ఇచ్చిన పాదుకలను స్వీకరించి, అతడు అరణ్యాలనుండి తిరిగి వచ్చేవరకు రాజ్యపాలనను శ్రీరామపాదుకల పేర చేశాడు.

భరతుని ఈ పారతంత్ర్య లక్షణపూర్తిని నిరూపించే సూక్తిని అయోధ్యాకాండలో గమనించవచ్చు. శ్రీరాముడు తనను విడచి అరణ్యాలకు వెళ్లాడని, తన స్వరూపానికి తగని విధంగా తల్లి తనను అయోధ్యకు ప్రభువు కావాలని కోరుకున్నదని తెలిసికొన్న భరతుడు.

**"విలలాప సభామధ్యే జగర్హే చ పురోహితమ్"** అనే విధంగా సభామధ్యంలో విలపించాడు. పురోహితుడైన వశిష్టుని నిందించాడు కూడా.

**"రాజ్యం చాహం చ రామస్య ధర్మం వక్తుమిహార్హసి"**

"చేతనుడను అయిన నేను, అచేతనమైన రాజ్యం – అనే ఈ రెండూ కూడా రామునకు శేషమే కదా. ఒక శేష వస్తువు ఇంకొక శేష వస్తువును పాలించడం – అనేది ధర్మమే అయితే, రాజ్యమే నన్ను పాలించనీ. రాజ్యాన్ని నేను పాలించడం ఎందుకు? వశిష్ట మహామునీ! ఈ విషయంలో ధర్మాన్ని మీరే చెప్పండి"– అని పురోహితుడైన వశిష్టుని నిలదీశాడు.

ఈ సూక్తులు అన్నీ జీవుని పారతంత్ర్యలక్షణాన్ని నిరూపిస్తున్నాయి. యుద్ధకాండ చివరిలో, పట్టాభిషేక సందర్భంగా శ్రీరాముడు లక్ష్మణుని యువరాజుగా చేయాలని అనుకున్నప్పటికీ, అందుకు లక్ష్మణుడు అంగీకరించలేదు. అప్పుడు, తనను యువరాజుగా చేస్తానన్న శ్రీరాముని

మాటను మన్నించి, భరతుడు తన పారతంత్ర్యస్వభావాన్ని నిరూపించుకున్నాడు.

అయోధ్యాకాండలో పాదుకాప్రదాన సందర్భంలో భరతుడు కల్పిన మాటలుకూడా అతని పారతంత్ర్య స్వభావాన్ని నిరూపిస్తున్నాయి.

**"రాజ్యం చ తవ రక్షేయ మహం వేలేవ సాగరమ్,**
**ప్రతిజానామి తే వీర మాభూవం వీరలోకభాక్"**

**(శ్రీరామాయణం –అయోధ్యాకాండ –23 –27)**

(ఓ వీరా! సముద్రాన్ని తీరంవలె, నేను నీ రాజ్యాన్ని రక్షిస్తాను. ఆ విధంగా చేయకపోతే, నీ రాజ్యంలోనే నివసించను. వీరుడైన దశరథుడు చేరిన వీర స్వర్గమనే లోకాన్ని చేరతాను – అని నేను ప్రతిజ్ఞ చేస్తున్నాను) అనే విధంగా తాను కోరిన శ్రీరామ కైంకర్యాన్ని నిర్బంధించి చేసిన లక్ష్మణునివలె కాకుండా, శేషి కోరిన దాస్యాన్ని చేయడం – అనే పారతంత్ర్యమే శేషభూతునకు ఉపాదేయం – అనే అర్థాన్ని భరతుడు ఆచరించి చూపించాడు. శ్రీరాముని విడచి బ్రతుకలేని తన స్థితిని కూడా లెక్కించకుండా, శేషి అయిన ఆ శ్రీరాముని మనసును గమనించి,

**"తతః శిరసి కృత్వా తు పాదుకే హేమభూషితే,**
**ఆరురోహ రథం హృష్టః శత్రుఘ్నేన సమన్వితః"**

(శ్రీరామాయణం – అయోధ్యాకాండ –113–1)

(తరువాత, శత్రుఘ్నునితో కూడిన భరతుడు, తన శిరస్సులో శ్రీరామపాదుకలను పెట్టుకుని చాలా ఆనందించినవాడై, అప్పుడే రథాన్ని అధిరోహించాడు) అని సంతోషంతో అయోధ్యకు తిరిగి వెళ్ళాడు, భరతుడు.

## భాగవతపారతంత్ర్యం

జీవుని స్వరూపానికి చెప్పబడిన భగవచ్ఛేషత్వ, పారతంత్ర్యాలు అనే రెండు, భాగవత పర్యంతంగా పర్యవసించినప్పుడే, వాటికి పూర్తి ఏర్పడుతుంది – అనేది శ్రీవైష్ణవసంప్రదాయం. ఈ అంశాన్ని శ్రీరామాయణం శత్రుఘ్నునిద్వారా నిరూపించినది.

ఈ భాగవత శేషత్వపారతంత్ర్య లక్షణం శత్రుఘ్ననిలో పూర్ణంగా అన్వయించిన వైనం అయోధ్యాకాండ ప్రారంభంలోని –

**"గచ్ఛతా మాతులకులం భరతేన తదా ఽ నఘః,**
**శత్రుఘ్నో నిత్యశత్రుఘ్నో నీతః ప్రీతిపురస్కృతః"**

(పాపం లేనివాడు, నిత్య శత్రువులైన ఇంద్రియాలను జయించినవాడైన శత్రుఘ్నుడు, ప్రీతిపూర్వకంగా, తన మేనమామ ఇంటికి వెళ్లే భరతునిచే, ఒక అచేతనపదార్థం వలె, తీసుకొని పోబడ్డాడు)అనే శ్లోకంలో తెలుపబడింది.

ఈ శ్లోకంలో, శత్రుఘ్ను భాగవత శేషత్వపారతంత్ర్య స్వరూపం వ్యక్తమవుతున్న తీరును శ్రీకృష్ణసూరి అనే శ్రీవైష్ణవాచార్యులు వివరించిన రీతి అద్భుతమైనది. అది, ఇక్కడ ప్రస్తావించబడుతున్నది.

(గచ్ఛతా) తన మేనమామ ఇంటికి వెళ్లే భరతుని చేత – అని అర్థం. "గచ్ఛతా" అనే వర్తమానకాలిక ప్రయోగానికి – తనకు ప్రత్యేకంగా ఏ విధమైన ప్రయోజనం లేకుండా, శత్రుఘ్నుడు భరతుని వెంట వెళ్ళినప్పుడు, తండ్రివద్ద, తల్లివద్ద, అన్నగారి వద్ద ఏ అనుమతిని తీసుకోకుండానే, భరతుడు లేకపోతే తాను ప్రాణాలు నిలుపుకోలేనివాడు అయినందున, ఆ భరతుడు వెళ్లేటప్పుడు, అతనివెంట నీడవలె, వెంట వెళ్లాడు– అని దీని భావం.

(మాతులకులమ్) మేనమామ ఇంటికి – అని అర్థం. యుధాజిత్తు భరతునకు మేనమామ అందువల్ల, అతడు తన మేనల్లుడైన భరతుని మాత్రమే పిలిచాడు. అందువల్ల, అక్కడకు వెళ్ళవలసిన నిర్బంధం భరతునకు మాత్రమే ఉన్నది. కానీ, శత్రుఘ్నుడు భరతుడు లేనిదే బ్రతుకలేడు కనుక, ఆ కారణం వల్ల తాను కూడా భరతుని వెంట వెళ్లాడని భావం.

(భరతేన) భరతునిచే – అని అర్థం. రాజ్యాన్ని భరించేవాడు అయినందున, దశరథచక్రవర్తి మరణించి, శ్రీరాముడు రాజ్యాన్ని వీడి, వనవాసానికి వెళ్ళగా, అతనిని లక్ష్మణుడుకూడా వెంబడించి వెళ్ళిపోగా, శత్రుఘ్నుడు కూడా, "భరతుని తప్ప వేరొకరిని నేను తెలియను " అనే స్థితిలో ఉండగా, ఇక, రాజ్యభారాన్ని భరించవలసినవాడు– అనే కారణం వల్లనే పుట్టినప్పుడే ఇతనికి భరతుడనే పేరును వశిష్టమహర్షి పెట్టాడు. " భరత ఇతి రాజ్యభరణాత్" (రాజ్యాన్ని భరించినందున భరతుడు అనబడుతున్నాడు) అని భరత శబ్దార్థాన్ని శ్రీశతానీకుడు తెలియజేశాడు.

(తదా) ఆ సమయంలోనే – అని అర్థం. భరతుడు, శత్రుఘ్నుడు, ఇద్దరూ రాజపుత్రులు అయినందున, వారు వెంట వెంటనే పుట్టినందున,

**"పుష్యే జాత స్తు భరతో మీనలగ్నే ప్రసన్నధీః,**
**సార్పే జాతౌ చ సౌమిత్రీ కుళీరే భ్యుదితే రవౌ"**

(శ్రీరామాయణం– బాలకాండ –20 –13) (స్వచ్ఛమైన జ్ఞానాన్ని, బుద్ధిని కలిగిన భరతుడు మీనలగ్నంలో పుష్యమీనక్షత్రంలో జన్మించాడు. సుమిత్రాదేవి పుత్రులైన లక్ష్మణ శత్రుఘ్నులు ఇద్దరూ కర్కాటకలగ్నంలో సూర్యుడు ఉండగా, ఆశ్లేషా నక్షత్రంలో జన్మించారు) అనే విధంగా, భరతుని శత్రుఘ్నుని జన్మనక్షత్రాలు వేరు వేరు అయినందువల్ల, వారిద్దరూ వారి వారి నక్షత్రాలకు తగినట్లుగా వేరు వేరు దినాలలో, ముహూర్తాలలో ప్రయాణం

చేయవలసి ఉన్నది. ఆ విధంగా అయినప్పటికీ, భరతుడు బయలుదేరిన ఆ ముహూర్తంలోనే శత్రుఘ్నుడు బయలుదేరాడు – అని ఇక్కడ భావం. " గచ్ఛతా"అనే వర్తమానకలిక పదంతోనే "ఒకే సమయంలో ఇద్దరూ బయలుదేరారు" అని అర్థం వస్తుందికదా. "తదా" అని అంటూ మళ్ళీ చెప్పవలసి ఉన్నదా? అని అంటే, అక్కడ "తనకు అని అంటూ ప్రత్యేకంగా ఏమీ లేదు"అనే మమకారం తీరిన విషయం ఆ పదంద్వారా చెప్పబడింది. "ఆ మమకారానికి స్థానమైన అహంకారం పూర్తిగా లేదు" అనే విషయం ఇక్కడ ఈ "తదా" అనే పదంద్వారా తెలుపబడుతున్నది. అందువల్ల పునరుక్తిశంకకు ఇక్కడ అవకాశం లేదు. శేషమై ఉండడానికి అహంకార, మకారాలు రెండు అడ్డు అవుతాయి కదా.

(అనఘః) పాపం ఏమీ లేనివాడు – అని అర్థం. ఇక్కడ "అఘమ్" అనే పదం, తాను కోరినదానిని పొందడానికి అడ్డుగా ఉండే పాపాన్ని తెలుపుతుంది. ఇక్కడ పాపం అనబడేది రామభక్తియే. చాలా గొప్పగా చెప్పబడే రామభక్తిని పాపం అని చెప్పవచ్చునా? అని అంటే, లోకంలో పాపమని చెప్పబడే దుష్కర్మ కంటే పుణ్యం అనే సత్కర్మ గొప్పది అయినప్పటికీ, " అశ్వ ఇవ రోమాణి విధూయ పాపం చంద్ర ఇవ రాహోః ముక్తాత్ ప్రముచ్య ,ధూత్వా శరీరమకృతం కృతాత్మా బ్రహ్మలోకమభిసంభవామీ త్యభిసంభవామీతి" (ఛాందోగ్యం– 8 –13– 1) (గుర్రం, తన జూలును విదలించుకున్నట్లుగా, పాపాన్ని విదల్చుకుని, రాహువు నోటినుండి బయటపడిన చంద్రునివలె, శరీరాన్ని విడచి, నిత్యమైన భగవంతుని పొందినవాడను కాగలను, పొందినవాడను కాగలను) అనే ఉపనిషద్వాక్యంలో, ముక్తిని పొందినప్పుడు విడువబడే పుణ్యపాపాలను రెండిటిని చేర్చి, పాపమని వ్యవహరించినట్లుగానే, ఇక్కడకూడా, శత్రుఘ్నుడు

తాను కోరిన భరత దాస్యానికి అడ్డుగా ఉన్నందున రామసౌందర్యంలో అభినివేశాన్ని పొందడం అనే రామభక్తిని పాపమని చెప్పవచ్చు కదా.

**"సృష్టస్త్వం వనవాసాయ స్వనురక్తః సుహృజ్జనే,**
**రామే ప్రమాదం మా కార్షీః పుత్ర! భ్రాతరి గచ్ఛతి"**

(శ్రీరామాయణం –అయోధ్యాకాండ –49–5)

(కుమారా! లక్ష్మణా! నీవు వనంలో నివసించడం కోసమే సృష్టించబడ్డావు. నీకు స్నేహితుడు అయిన శ్రీరాముని విషయంలో నీవు చాలా స్నేహభావాన్ని కలిగి ఉన్నావు. నీ అన్న రాముడు వనానికి వెళ్ళేటప్పుడు, నీకు ముందు నడిచి వెళతాడు. . అప్పుడు నీవు అతని నడక అందంలో ఆసక్తిని పొంది, అతనికి సేవ చేయడంలో అజాగ్రత్తగా ఉండకుసుమా!) అని అంటూ సుమిత్ర. " శ్రీరాముని సౌందర్యంలో అభినివేశాన్ని పొందడం " అనేది శ్రీరాముని రక్షించడం అనే సేవకు ఆటంకం అవుతుందని చెప్పిందికదా. అదే విధంగా, ఇక్కడ, రామభక్తి అనేది భరతునకు దాస్యం చేయడానికి శత్రుఘ్నునకు అడ్డుగా ఉన్నందువల్ల, దానిని పాపమని అనడంలో ఏ అడ్డు లేదు.

(శత్రుఘ్నః) శత్రువులను వధించేవాడని దీని అర్థం. రాముడు మొదలైన నలుగురు కుమారులు జన్మించినప్పుడు, వారి వారి రూపసన్నివేశాలను గమనించి, వారి కులగురువైన శ్రీవశిష్టభగవానుడు వారికి తగిన పేర్లను పెట్టాడు. పెద్ద కుమారుడు తనను చూసినవారిని అందరిని తన అందంతో ఆనందింప చేస్తాడు కనుక రాముడని, భగవంతునకు సేవ చేయడమే స్వరూపంగా తోచినందువల్ల, "భగవంతునకు దాస్యం చేయడం అనే సంపదను కలవాడు "అనే కారణాన్ని పురస్కరించుకొని సుమిత్ర మొదటి కుమారుని లక్ష్మణుడని, రెండవ కుమారుని చూసినప్పుడు, ఇతనిని

చూడగానే శత్రువులు నశించే రీతిలో ఉన్నందున, " శత్రుఘ్నః " –శత్రువులను నశింపజేసేవాడు – అనే పేర్లను పెట్టాడు.

(నిత్యశత్రుఘ్నః) నిత్యశత్రువులను కూడా నశింపచేసేవాడు – అని అర్థం. బాహ్యాశత్రువులను మాత్రమే కాకుండా, శరీరంలోపల ఉండే శత్రువులైన ఇంద్రియాలను కూడా జయించినవాడని దీని భావం. ఆ ఇంద్రియజయం ఎంతవరకు, ఎంత పరిమితిలో ఇతనికి ఉన్నది? అని అంటే, "రూపౌదార్యగుణైః పుంసాం దృష్టిచిత్తాపహారిణమ్" (శ్రీరామాయణం –అయోధ్యాకాండ – 3– 29) (రూపసౌందర్యం, ఔదార్యం, గుణాలు మొదలైనవానితో పురుషుల నేత్రాలను, మనస్సును హరించే శ్రీరాముని) అని చెప్పిన విధంగా, పురుషులనుకూడా స్త్రీవేషం ధరించేటట్లు చేసే శ్రీరాముని అందరంలో కూడా చిక్కుకొనని పరిమితిలో తన ఇంద్రియాలను తన వశం చేసుకున్నాడు –అని భావం.

మరి, "జగ్రాహ భరతో రశ్మీన్ శత్రుఘ్నః ఛ్ఛత్ర మాదదే" (రామాయణం– యుద్ధకాండ 131–28) (శ్రీరాముని రథానికి కట్టిన గుర్రాల పగ్గాలను భరతుడు బిగించి పట్టుకున్నాడు శత్రుఘ్నుడు శ్రీరామునకు గొడుగును పట్టాడు) అని చెప్పినట్లుగా, పట్టాభిషేక సమయంలో శత్రుఘ్నుడు శ్రీరామునకు గొడుగును పట్టడం అనే సేవను చేసినట్టుగా కనిపిస్తున్నది కదా!, అని అంటే, ఆ విధంగా తను కైంకర్యాన్ని చేసేటప్పుడు, తాను కోరుకున్న దాస్యం అనే భావనతో కానీ, శ్రీరాముని అందంలో అభినివేశాన్ని పొందిగానీ చేయకుండా, " "భరతునకు అది ఇష్టమైనది" అనే భావనతోనే శత్రుఘ్నుడు ఆ రామకైంకర్యాన్ని చేశాడు.

(నీతః) తీసుకొని పోబడ్డాడు – అని అర్థం. ప్రభువులు బయలుదేరేటప్పుడు, చురకత్తివంటి ఆయుధాలను తమ వెంట తీసుకొని

పోయేటట్లు, భరతునిచేత శత్రుఘ్నుడు తీసుకొని పోబడ్డాడు – అని దీని భావం. రెండు వస్తువులు, ఒక దానితో ఇంకొకటి కలసినప్పుడు, అవి, ఒక దానినుండి ఇంకొకటి విడదీయడానికి వీలు ఉంటుంది. కానీ, ఒక ద్రవ్యంతో దాని జాతి, గుణాలు కలసి ఉండేటప్పుడు, ఆ జాతి గుణాలను ఆ ద్రవ్యంనుండి వేరు చేయడనికి వీలు ఉండదు. ఈ సంబంధానికి అపృథక్సిద్ధసంబంధమని పేరు. భరతుడు, శత్రువుడు అనే ఇద్దరు రెండు వేరు వేరు ద్రవ్యాలే అయినప్పటికీ, భరతుని జాతిగుణాలవలె, శత్రుఘ్నుడు అతనితో విడదీయడానికి వీలుకాని విధంగా భరతునిచే తీసుకొని పోబడ్డాడు – అని భావం.

(ప్రీతిపురస్కృతః) ప్రీతితో వెంట తీసుకొని పోబడ్డాడు. "అన్న అయిన భరతునకు సేవను చేయడం తనకు కర్తవ్యం " అనే కర్తవ్యతా బుద్ధితో శత్రుఘ్నుడు భరతునితో వెళ్లలేదు.

**"భవాం స్తు సహ వైదేహ్యా గిరిసానుషు రంస్యతే,**
**అహం సర్వం కరిష్యామి జాగ్రతః స్వపత శ్చ తే"**

(శ్రీరామాయణం– అరణ్య కాండ– 31 –25)

(శ్రీరామా! నీవు, సీతతో పాటు పర్వత సానువులలో విహరించబోతావు. అప్పుడు, నేను, నీవు మెలకువగా ఉండేటపుడు, నిద్రపోయేటప్పుడు కూడా నీకు అన్ని విధాలయిన సేవలను చేస్తాను) అని ఆశపడి శ్రీరామునితో వెంట అరణ్యానికి తోడుగా పోయిన లక్ష్మణునివలె, భరతుడు పోయే ప్రదేశాలలో అతని వెంట వెళ్లి, అన్నిచోట్ల అతనికి అన్ని విధాలయిన సేవలను చేయాలి – అనే కోరికతో, ప్రేమతో ప్రేరేపింపబడినవాడై, శత్రుఘ్నుడు భరతుని వెంట వెళ్ళాడు – అని ఇక్కడ భావం. అయోధ్యలో ఉండేటప్పుడు, భరతునకు సేవలు చేయడానికి చాలామంది ఉంటారు కనుక,

భరతునకు చేసే సేవలలో ఏదో కొంత భాగం మాత్రమే తనకు లభిస్తుంది. ఆ విధంగా కాకుండా, ఇప్పుడు భరతునకు అన్ని విధాలయిన సేవలను చేసి ఆనందించవచ్చు – అని ఆశపడి శత్రుఘ్నుడు భరతుని వెంట వెళ్ళాడు – అని ఇక్కడ తాత్పర్యం.

ఇక్కడ, " నీతః "తీసుకొని పోవడ్డాడు అని అన్నందువల్ల, స తనకు ప్రత్యేకంగా ఏ ఆనందం లేకుండా, భరతుని ఆనందమే తన ఆనందంగా తలచి, ఒక అచేతనవస్తువు వలె, అతని వెంట శత్రుఘ్నుడు వెళ్ళాడు – అనే అర్థం ఇక్కడ తెలుపబడింది. "ప్రీతిపురస్కృతః నీతః" అని చెప్పినందున, శత్రుఘ్నుడు తన స్వరూపానికి తగిన భరతుని సేవను చేసేటప్పుడు, తన కోసంగా ప్రత్యేకంగా ఏ ఆనందం లేకపోయినా, జ్ఞానాన్ని, చైతన్యాన్ని తాను కలిగినవాడు కనుక, భరతుని ఆనందాన్ని చూచి సంతోషించే ఆనందం ఇతనికి, అంటే, శత్రుఘ్నునకు ఉన్నది – అని తెలుపబడింది. వేదంకూడా ముందు "అహమన్న మహమన్న మహమన్నమ్" (నేను భగవంతునకు అన్నం వలె భోగ్యపదార్థమై ఉన్నాను, భోగ్యపదార్థమై ఉన్నాను, భోగ్యపదార్థమై ఉన్నాను) అని చెప్పి, ఆ తరువాత, ఆ భగవంతుని ఆనందాన్ని చూచి ఆనందించే తన స్థితిని, " అహమన్నాదః అహమన్నాదః అహమన్నాదః" (నేను అన్నం అని చెప్పబడే భగవంతుని అనుభవించి ఆనందించేవాడనై ఉన్నాను) చెప్పింది కదా. ఇదే క్రమాన్ని కులశేఖరులు అనే ఒక అళ్వార్లు తమ ప్రబంధంలో " పడియాయ్ కిడందు ఉన్ పవళ వాయ్ కాణ్బేనే" (నీ గర్భాలయంలో నేను గడపగా పడి ఉండి, ఈ పగడపు మోవిని దర్శిస్తాను) అని అంటూ శ్రీవేంకటేశ్వరుని విషయంగా అనుసంధించారు. ఇక్కడ, " పడియాయ్ కిడందు" (గడపగా పడి ఉండి) అని అంటూ తమకు ఏ ఆనందం ప్రత్యేకంగా లేకుండా ఒక అచిత్తువలే ఉండాలి – అని పలికిన తరువాత, " ఉన్ పవళ వాయ్ కాణ్బేనే" (ఈ పగడంవంటి నీ అధరాన్ని దర్శిస్తాను) అని అంటూ

చైతన్య ప్రయుక్తమైన, శ్రీవేంకటేశ్వరుని ఆనందాన్ని చూచి, తాము ఆనందం పొందే స్థితి తమకు ఉన్నదని తెలియజేశారు.

ఈ విధంగా శ్రీరామాయణం " గచ్ఛతా మాతుల కులమ్" అనే ఈ శ్లోకంలో భాగవత శేషత్వ పారతంత్ర్యాలు రెండు చేతన లక్షణాలుగా నిరూపించడాన్ని గమనించవచ్చు.

శ్రీరామాయణంలో నిరూపింపబడిన జీవస్వరూపవిచారాన్ని ఇంతటితో ముగించి, ఇక మూడవది అయిన ఉపాయస్వరూపాన్ని విశిష్టాద్వైత సిద్ధాంతానుగుణంగా శ్రీరామాయణం ఏ విధంగా ప్రతిపాదించిందో సంగ్రహంగా గమనిద్దాం.

## ఉపాయస్వరూపం

మోక్షప్రాప్తికి కర్మజ్ఞానభక్త్యాది వివిధోపాయాలను వేదం తెలుపుతూ ఉన్నప్పటికీ, ఈ ఉపాయాలన్నిటిలోనూ న్యాసమనే శరణాగతి ఉత్తమమైన ఉపాయం అని " "తస్మాన్న్యాసమేషాం తపసా మతిరిక్త మాహుః" (అందువల్ల, న్యాసం అనబడే ఈ ఉపాయం, అన్ని మోక్షోపాయాలలో విలక్షణమైనదని అంటారు) అని అంటూ తెలిపింది. ఈ ఉపాయమే ప్రపత్తి అని, శరణాగతి అని చెప్పబడుతున్నది.

ఈ శరణాగతిని భగవానుడే సాక్షాత్తు వైకుంఠంలో లక్ష్మీదేవికి ద్వయమంత్ర రూపంగా ఉపదేశించాడని శ్రీవైష్ణవ సంప్రదాయం. వేదంలోని కఠవల్లిలో, రెండు వేరు వేరు చోట్ల ఉండే " శ్రీమన్నారాయణచరణౌ శరణం ప్రపద్యే", " శ్రీమతే నారాయణాయ నమః" అనే రెండు వాక్యాలను ఒకటిగా చేర్చి, భగవానుడు ఈ ద్వయమంత్రాన్ని ఉపదేశించాడు – అని పూర్వాచార్యుల వివరణం.

## శ్రీరామాయణంలో విశిష్టాద్వైతం

శ్రీరామాయణంలో ఆరంభంనుండి చివరి వరకు అన్ని కాండలలోనూ శరణాగతి అనబడే ఈ ఉపాయం పలుమార్లు ఆ యా వృత్తాంతాలద్వారా ప్రతిపాదింపబడింది. శ్రీరామాయణం ఈ ద్వయమంత్రార్థాన్ని సాకల్యంగా అనుసంధిస్తున్న వైనాన్ని శ్రీరామాయణవ్యాఖ్యాత గోవిందరాజాచార్యులవారు తమ వ్యాఖ్యానంలో స్పష్టం చేశారు. శ్రీరామాయణం ఈ ద్వయమంత్రాన్ని అనుసంధించిన క్రమంకూడా శ్రీవైష్ణవసంప్రదాయ క్రమానుసారంగా ఉండడాన్ని వారు తమ శ్రీరామాయణభూషణ వ్యాఖ్యానంలో సూచించారుకూడా.

కిష్కింధాకాండ వ్యాఖ్యానారంభంలో " వస్తుతస్తు ప్రథమే కాండే శ్రీమత్త్వమ్ శ్రీమత్పదోరిత ముక్త్వా, ద్వితీయే సర్వజనవ్యామోహవిషయత్వోక్త్యా నారాయణ శబ్దార్థః, తృతీయే పంచవటివాసపర్యంత వృత్తాంతేన మునిజనకైంకర్యోక్త్యా చతుర్థ్యర్థః. ఖరాదివృత్తాంతేన నమశ్శబ్దార్థ ఉక్తః" అని అనడంవల్ల, బాలకాండ మొదలు, అరణ్యకాండలో ఖరదూషణాదివధవృత్తాంత పర్యంతంగా ద్వయమంత్రంలోని ఉత్తరవాక్యార్థం అనుశీలించబడిందని తెలుస్తున్నది. దీనినిబట్టి ముందుగా ద్వయమంత్రంలోని ఉత్తరవాక్యంలోని అర్థం, ఆ తరువాత పూర్వవాక్యంలోని ప్రతిపాదింపబడిందని చెప్పవచ్చు.

ఈ క్రమానికి శ్రీవైష్ణవసాంప్రదాయికమైన నేపథ్యం ఉన్నది. దివ్యసూరులలో ప్రధానులైన శ్రీశఠకోపసూరి అనుగ్రహించిన సహస్రగీతిప్రబంధంలోకూడా ద్వయమంత్రార్థం ప్రతిపాదింపబడిందని సంప్రదాయం. ఈ ప్రబంధంలోని ముందు మూడు శతకాలలో ద్వయంలోని ఉత్తరవాక్యార్థం, ఆ తరువాత ఉండే మూడు శతకాలలో పూర్వవాక్యార్థం వివరింపబడిందని సాంప్రదాయికమైన వివరణం ఒకటి ఉన్నది. ఈ క్రమాన్ని అనుసరించి, శ్రీరామాయణంలోకూడా, మొదటి మూడు కాండలలో

ద్వయంలోని ఉత్తరవాక్యార్థం, ఆ తరువాత పూర్వవాక్యార్థం వివరింపబడినదనే క్రమం చెప్పబడిందని భావించవచ్చు.

ఈ విధంగా, ఈ రెండు గ్రంథాలలో, ముందు ద్వయంలోని ఉత్తరవాక్యార్థం, ఆ తరువాత పూర్వవాక్యార్థం ప్రతిపాదింపబడిందనే వివరణకూడా వైదికక్రమాన్ని అనుసరించి చేయబడడం ఇక్కడ గమనించదగిన వేరొక అంశం. ఉపదేశ వేళలో ముందు ప్రయోజనాన్ని నిర్దేశించి, ఆ తరువాత, ఆ ప్రయోజనానికి తగిన ఉపాయాన్ని ఉపదేశించడం వైదికక్రమం. వేదంకూడా స్వర్గప్రాప్తిని ఉద్దేశించి " స్వర్గకామో జ్యోతిష్టోమేన యజేత" అని జ్యోతిష్టోమయాగాన్ని విధించింది. ఇక్కడ, స్వర్గప్రాప్తి ప్రయోజనం. దానికి తగిన సాధనం జ్యోతిష్టోమయాగం. ఆ విధంగానే, ప్రస్తుతంలోకూడా ముముక్షువుకు ప్రయోజనమైన భగవత్కైంకర్య స్వరూపాన్ని వివరించే ఉత్తరవాక్యంలోని అర్థం ముందుగా ప్రతిపాదింపబడి, ఆ తరువాత, దానికి తగిన ఉపాయం అయిన ప్రపత్తిని తెలిపే పూర్వవాక్యార్థం వివరింపబడింది. శ్రీరామాయణం, సహస్రగీతి ప్రబంధం – అనే ఈ రెండుకూడా ఉపదేశాత్మక ప్రబంధాలుగా భావించే అవకాశం ఉన్నదికదా. వాల్మీకి అడిగిన ప్రశ్నకు నారదుడు చేసిన ఉపదేశమే శ్రీరామాయణం. అదేవిధంగా, తాను పొందిన భగవదనుభవాన్ని, దానికి తగిన ఉపాయాన్ని లోకంలో ఉండే అందరికీ శ్రీశఠకోపసూరి ఉపదేశించే ప్రబంధం సహస్రగీతి. ఈ విధంగా ఉండే అర్థసామ్యాన్నిబట్టి ఈ రెండు ప్రబంధాలలోనూ ముందు ద్వయమంత్రంలోని ఉత్తర వాక్యార్థం, ఆ తరువాత పూర్వవాక్యార్థం అనుశీలింపబడిందనే క్రమం చెప్పబడిందని భావించవచ్చు.

ఈ విధంగా వ్యుత్క్రమంగా కాకుండా, సక్రమంగానే ద్వయమంత్రార్థాన్ని వివరించే క్రమం ఈ రెండు ప్రబంధాలలోను ఉన్నదనే సమన్వయాన్నికూడా పూర్వాచార్యులు ఉద్భావించారు. శ్రీరామాయణంలోని

18 విధాలయిన సంప్రదాయరహస్యార్థాలను శ్రీరామానుజులు తమ మేనమామ అయిన శ్రీశైలపూర్ణులనుండి శ్రవణం చేశారనే సాంప్రదాయికమైన కథనం ఉన్నది. అందులో, శ్రీరామాయణం ద్వయమంత్రార్థ వివరణమనే అంశం ఒకటి. అది ఈ విధంగా వివరింపబడింది.

"అస్య చ కాలక్షేపో ఽ పి రామాయణేనైవ, ద్వయవివరణరూపత్వాత్. అత ఏవ శ్రీరామాయణం దీర్ఘశరణాగతిరితి అభియుక్తై రుక్తమ్. ద్వయ మర్థానుసంధానేన సహ సదైవం వక్తా ఇతి చ భాష్యకారః.

తత్ర, బాలకాండేన శ్రీమచ్ఛబ్దార్థ ఉక్తః. అయోధ్యాకాండేన నారాయణశబ్దార్థః, కల్యాణగుణానా ముపవర్ణనాత్. అరణ్యాకాండేన "తే తం సోమ మివోద్యంతమ్" ఇత్యాదినా దివ్యమంగళ విగ్రహవర్ణదాత్ చరణశబ్దార్థః. కిష్కింధాకాండ సుందరకాండాభ్యాం శరణశబ్దార్థః. యుద్ధకాండేన ప్రపద్యే ఇత్యస్యార్థః. ఉత్తరకాండేన ముక్తిఫలకీర్తనాత్ ఉత్తరఖండార్థః"

(ప్రపన్నుని కాలక్షేపంకూడా శ్రీరామాయణం ద్వారానే. ఎందుకంటే, ఇది ద్వయమంత్ర వివరణ రూపం కనుక. అందువల్లనే శ్రీరామాయణం దీర్ఘశరణాగతి అని విజ్ఞుల చేత చెప్పబడింది. "ద్వయమంత్రాన్ని అర్థానుసంధాన పూర్వకంగా ఎల్లప్పుడూ ఈ విధంగా అనుసంధించుకునేవాడవై" అని శ్రీ రామానుజుల సూక్తి. శ్రీరామాయణంలోని బాలకాండలో ద్వయమంత్రంలోని శ్రీమత్పదార్థం చెప్పబడింది. అయోధ్యాకాండలో శ్రీరాముని కళ్యాణగుణాలు వర్ణింపబడినందున నారాయణశబ్దార్థం తెలుపబడింది. అరణ్యాకాండలో "తే తం సోమ మివోద్యంతమ్" అని మొదలుగా శ్రీరాముని దివ్యమంగళవిగ్రహవర్ణనం చేయబడినందున చరణశబ్దార్థం చెప్పబడింది. కిష్కింధాకాండ,

సుందరకాండలలో శరణశబ్దార్థం, యుద్ధకాండలో " ప్రపద్యే " అనే పదంలోని అర్థం తెలుపబడ్డాయి ఇక, చివరిగా ఉత్తరకాండలో ముక్తిఫలం కీర్తింపబడినందున, అందులో ద్వయమంత్రంలోని ఉత్తరవాక్యార్థం చెప్పబడింది.)

ఈ విధంగా శ్రీరామాయణం ఏడు కాండలలోను ద్వయమంత్రం పూర్తిగా వివరింపబడింది.

ఇక్కడ విశేషం ఏమంటే, శఠకోపుల సహస్రగీతిప్రబంధంలో కూడా, ఈ విధంగానే, ద్వయమంత్రార్థం సక్రమంగానే వివరింపబడిందనే సమన్వయాన్ని శ్రీలోకాచార్యులవారు సారసంగ్రహం అనే తమ గ్రంథంలో వివరించారు.

ఇటువంటి అర్థసామ్యాన్ని పురస్కరించుకొని, శ్రీరామాయణం దీర్ఘశరణాగతిగా ప్రసిద్ధమైనట్లే, శఠకోపుల సహస్రగీతి ప్రబంధంకూడా, దీర్ఘశరణాగతిగానే భావింపబడుతున్నది. ఈ రెండు ప్రబంధాలలోను శరణాగతి పలు పర్యాయాలు ఆచరింపబడడమే దీనికి కారణం. వీటి మధ్య భేదం ఏమంటే, శ్రీరామాయణంలో, పలువురు పలు సందర్భాలలో శరణాగతిని ఆచరించగా, సహస్రగీతిలో, శ్రీశఠకోపులు ఒక్కరే శరణాగతిని పలుమార్లు ఆచరించారు.

శ్రీరామాయణంలో, బాలకాండ ఆరంభంలో దేవతల శరణాగతి మొదలుకొని, ఉత్తరకాండలో చివర బ్రహ్మ యముని సందేశంద్వారా చేసిన శరణాగతివరకు ఎన్నో శరణాగతులు గోచరిస్తాయి. ఈ శరణాగతులు అన్నిటిలోనూ విభీషణశరణాగతి ప్రధానమైనది, షడంగపూర్ణమైనది. ఈ శరణాగతిని శ్రీకృష్ణసూరి, వేదాంతదేశికులు అనే ఆచార్యులు విశేషంగా వ్యాఖ్యానించారు.

శ్రీరామాయణంలో విశిష్టాద్వైతం

శ్రీరామాయణంలో కనిపించే పలు శరణాగతులలో కిష్కింధాకాండలో శ్రీరాముడు సుగ్రీవుని ఉద్దేశించిన శరణాగతి ఒకటి ఉన్నది. వాస్తవానికి సర్వశరణ్యుడైన శ్రీరాముడు సుగ్రీవుని ఆశ్రయించడం అనేది ఆశ్చర్యకరంగానే తోచినా, అది శరణ్యాభిమతకార్యం కనుక, భగవల్లీలా విశేషంగానే భావించవలసి ఉన్నది.

ఆ విధంగానే, యుద్ధకాండలో శ్రీరాముడు సముద్రుని ఉద్దేశించి చేసిన శరణాగతి ఇంకొకటి ఉన్నది. ఈ శరణాగతి ఫలించకపోవడానికి కారణం – సముద్రునిలో శరణ్యునకు ఉండవలసిన లక్షణాలు లేకపోవడమే. అందువల్ల అసమర్థుని విషయంలో చేసిన శరణాగతి ఫలించదనే అంశం ఇక్కడ నిరూపించబడింది.

శరణాగతి షడంగమని శాస్త్రాలు తెలుపుతున్నవి. ఆనుకూల్యసంకల్పం, ప్రాతికూల్య వర్జనం, భగవానుడు తప్పక రక్షిస్తాడు అనే విశ్వాసం, భగవానుని రక్షకునిగా వరించడం, ఆత్మరక్షణ భారాన్ని భగవంతుని సన్నిధిలో సమర్పించడం, అనను తాను రక్షించుకోవడానికి తన దగ్గర ఏమీ లేదని తెలియజేయడమనే ఆకించన్యం – ఈ ఆరు శరణాగతిలోని అంగాలు.

వీటిలో, ఆకించన్యం, అనన్యగతిత్వం – అనే రెండు చాలా ప్రధానమైనవి. ఈ రెండిటిని శ్రీరామాయణం కాకాసురవృత్తాంతంద్వారా తెలియజేసింది. కాకాసురుడు–

**“స పిత్రా చ పరిత్యక్తః సురైశ్చ సమహర్షిభిః,**
**త్రీన్ లోకాన్ సంపరిక్రమ్య తమేవ శరణం గతః”**

(ఆ కాకాసురుడు తండ్రిచేత తల్లిచేత, దేవతలచేత, మహర్షులచేతకడా విడువబడినవాడై, ముల్లోకాలను మాటిమాటికి తిరిగి, చివరికి ఏగది లేనివాడై ఆ శ్రీరామునే శరణం పొందాడు) అని తెలుపడంద్వారా ఈ రెండు శరణాగతిలో ముఖ్యమని శ్రీరామాయణం సూచించింది.

కాకాసుర వృత్తాంతం ద్వారా తల్లి, తండ్రి రక్షకులు కారని, దశరథ వృత్తాంతంద్వారా తండ్రి రక్షించలేడని, విభీషణ మేఘనాదాది వృత్తాంతాల ద్వారా సోదరుడు కానీ, పుత్రుడు కానీ రక్షకులు కారని తెలియజేయబడింది. ఈ విషయాన్ని శ్రీలోకాచార్యులు అనే శ్రీవైష్ణవాచార్యులు ప్రపన్నపరిత్రాణం అనే ఒక ద్రావిడగ్రంథంలో ఇంకా మరికొన్ని పౌరాణికోదాహరణలతో స్పష్టంగా నిరూపించారు.

శరణాగతిలో భగవంతుడే రక్షకుడు, అతడు తప్పక రక్షిస్తాడు – అనే విశ్వాసంకూడా చాలా ముఖ్యమైనది. " మహావిశ్వాసపూర్వకం తదేకోపాయతాయాచ్ఞా శరణాగతిః" (ఏ విధంగానూ సడలని దృఢమైన విశ్వాసంతో "భగవానుడే ఉపాయం కావాలి" అనే ప్రార్థనయే శరణాగతి) అని శరణాగతి నిర్వచింపబడింది. ఇటువంటి మహా విశ్వాసమనే అంగాన్ని శ్రీరామాయణం సుందరకాండలో సీతాదేవి పలికిన

**"శరై స్తు సంకులాం కృత్వా లంకాం పరబలార్దనః,**
**మాం నయేద్యది కాకుత్స్థః తత్ తస్య సదృశం భవేత్"**

(శ్రీరామాయణం –సుందరకాండ –39 –30)

(శత్రువులను సంహరించే శ్రీరాముడు తన బాణాలతో లంకానగరాన్ని సంకులం చేసి, నన్ను రక్షించి తిరిగి తీసుకొని వెళ్లడం అనేది అతనికి తగినది కాగలదు) అనే వచనంద్వారా తెలిపింది.

విభీషణుడు చేసిన శరణాగతిలో, శరణాగతికి సంబంధించిన అన్ని అంగాలు ఉన్నాయని ఆ సందర్భాన్ని వ్యాఖ్యానించిన శ్రీవైష్ణవాచార్యులు విశదంగా నిరూపించారు.

## శరణాగతి – భగవంతుని నిర్హేతుకకృప

ప్రపన్నుడు భగవంతుని ఉద్దేశించి చేసే శరణాగతి స్వరూపాన్ని శ్రీవైష్ణవసంప్రదాయానికి చెందిన పూర్వాచార్యులు " స్వప్రవృత్తినివృత్తిః ప్రపత్తిః (తనను తాను రక్షించుకోవడం అనే స్వప్రయత్నంనుండి విరమించడమే ప్రపత్తి అనబడుతుంది) అని నిర్వచించారు. ఇందువల్ల, ఈ ప్రపత్తి అనేది చేతనునకు భగవంతుడు అనుగ్రహించడానికి తగిన యోగ్యతను కలిగిస్తుంది, అంతే తప్ప, సాక్షాత్తుగా మోక్షోపాయం కాదు. సాక్షాదుపాయం భగవంతుని నిర్హేతుక కరుణయే– అనేది శ్రీవైష్ణవసంప్రదాయం. దీనికే పరగత స్వీకారం అనికూడా పేరు. ఇది, భరతుని శరణాగతిలో వ్యక్తం చేయబడింది. భరతుడు తన ఆకించన్య – అనన్య గతిత్వాదులను పురస్కరించుకొని సర్వశరణ్యుడైన శ్రీరాముని శరణాగతి చేసినా, అది వెంటనే ఫలించలేదు. ఇందువల్ల, భగవంతుని కరుణయే సాక్షాత్ ఉపాయం తప్ప, ప్రపత్తికూడా సాక్షాత్ ఉపాయం కాదు – అనే సంప్రదాయికమైన అంశం ఇక్కడ సూచింపబడిందని శ్రీవైష్ణవ సంప్రదాయం.

భరతుని శరణాగతి కాలాంతరంలో ఫలించడంకూడా శరణ్యుడైన శ్రీరాముని సంకల్పానుసారమే.

## లక్ష్మీపురుషకారం

ఈ విధంగా భగవంతుని ఉద్దేశించి చేసే ఈ శరణాగతి లక్ష్మీపురుషకార పూర్వకమై ఉన్నప్పుడే ఫలిస్తుంది – అనే సాంప్రదాయికాంశాన్ని శ్రీరామాయణం పలు సందర్భాలలో అనుకూల వ్యతిరేకోదాహరణలతో తెలిపింది. అయోధ్యాకాండలో లక్ష్మణుడు శ్రీరాముని ఉద్దేశించి, శరణాగతి చేసేటప్పుడు,

**"స భ్రాతుః చరణౌ గాఢం నిపీడ్య రఘునందనః,**
**సీతా మువాచాతియశాః రాఘవం చ మహావ్రతమ్"**

(రఘునందనుడు, గొప్ప కీర్తిని కలిగినవాడు అయిన ఆ లక్ష్మణుడు, శరణాగతులను రక్షించడం అనే గొప్ప వ్రతాన్ని కలిగినవాడు, తనకు సోదరుడైన శ్రీరాముని చరణాలను, సీతాపురుషకారపూర్వకంగా అశ్రయించాడు) అని సీతాదేవిని పురస్కరించుకొని శరణాగతి చేయడంద్వారా ఈ అంశం తెలుపబడింది. విభీషణశరణాగతి, సుగ్రీవశరణాగతి సీతాదేవి పురుషకార పురస్సరమైనందువల్లనే ఫలించినవి అని శ్రీవైష్ణవ సాంప్రదాయకమైన వివరణం.

"కాకాసురుడు, రావణుడు, ఈ ఇద్దరూ సీతాదేవి విషయంలో చాలా అపచారపడినవారే. ఈ ఇద్దరిలో, కాకాసురుడు ఎక్కువ అపచార పడ్డాడు. ఐనప్పటికీ అతని విషయంలో సీతాదేవి పురుషకారం ఉన్నందువల్ల, " కృపయా పర్యాపాలయత్" అని చెప్పినట్లుగా కాకాసురుడు రక్షింపబడ్డాడు. సీతాపురుషకారం లేనందువల్ల రావణుడు ప్రాణాలను కోల్పోయాడు "– అని రహస్య త్రయ వివరణాత్మకమైన "ముముక్షుప్పడి" ఈ గ్రంథంలో శ్రీలోకాచార్యులవారు అనే శ్రీవైష్ణవాచార్యులు వివరించారు.

ఇందువల్ల, ఈ శరణాగతి అనే ఉపాయం లక్ష్మీపురుషతార పురస్సరమైనప్పుడే ఫలిస్తుంది– అనే అంశాన్ని ఇటువంటి వృత్తాంతాలద్వారా శ్రీరామాయణం ఉపదేశించింది.

## ఇక, అర్థపంచకంలోని నాలుగవ అంశం, ఫలస్వరూపం

భగవంతునకు మంగళాశాసనరూప కైంకర్యమే ప్రపన్నునుడు కోరదగిన, చేయదగిన పరమప్రయోజనం

భగవంతుని శరణాగతి చేసే ముముక్షువునకు కోరదగిన పరమప్రయోజనం భగవన్ముఖోల్లాసరూపమైన భగవన్మంగళాశాసనరూప కైంకర్యమే – అనే విషయాన్ని ద్వయమంత్రంలోని రెండవ వాక్యం తెలుపుతున్నది. ఈ విషయాన్ని వేదం " తద్విప్రాసః విపన్యవః జాగృవాంసః సమింధతే" (పరమపదంలో ఆ పరిపూర్ణమైన జ్ఞానాన్ని కలిగిన నిత్యసూరులు భగవంతునకు రెప్పపాటు లేకుండా, నిత్యంగా మంగళాశాసనం చేయడమే స్వభావంగా కలిగినవారై, గొప్పగా ప్రకాశిస్తున్నారు) అని తెలిపింది. ఈ అర్థాన్నే శ్రీరామాయణం అన్ని కాండలలోనూ ఉపదేశించింది. బాలకాండలో విశ్వామిత్రుడు, జనకచక్రవర్తి, దశరథుడు మొదలయినవారు, అయోధ్యాకాండలో అయోధ్యాపురజనులు, కౌసల్య, అరణ్యాకాండలో దండకారణ్యవాసులైన మహర్షులు, జటాయువు, కిష్కింధాకాండలో హనుమంతుడు, సుందరకాండలో సీతాదేవి, యుద్ధకాండలో సుగ్రీవుడు – ఈ విధంగా పలువురు పలు సందర్భాలలో ఈ భగవన్మంగళాశాసనకైంకర్యాన్ని చేయడాన్ని శ్రీరామాయణం తెలిపింది.

శరణాగతి రూపమైన ఉపాయానికి ప్రాప్యం భగవత్ప్రాప్తి పూర్వకమైన కైంకర్యమే అనే విషయం శ్రీరామాయణంలో తెలుపబడిన వైనాన్ని శ్రీరామాయణ సంప్రదాయార్థ సంగ్రహం ఈ విధంగా వివరించింది.

ఆరంభంలో దేవతలు చేసిన శరణాగతికి రామకైంకర్యం ప్రధానఫలంగా లభించింది. దేవతలు వానర భల్లూకాదిరూపాలలో జన్మించి, రామునకు సహాయం చేయడం అనే కైంకర్యఫలాన్ని పొందారు. అప్సరఃస్త్రీలుకూడా వారికి భార్యలుగా జన్మించి, వారిని అనుసరించడంవల్ల వారికి రామదాస్యరూప ఫలం లభించింది. దేవతలు చేసిన శరణాగతికి రావణవధ అనేది అప్రధానఫలం తప్ప, ప్రధాన పలం కాదు.

లక్ష్మణుడు శ్రీరాముని శరణాగతి చేసి, అతని వెంట అరణ్యాలకు వెళ్లడంకూడా, శ్రీరామునకు సర్వదేశ సర్వకాల సర్వావస్థలలో సేవను చేయడం కోసమే. ఈ విషయాన్ని అతడే స్వయంగా –

**"భవాం స్తు సహ వైదేహ్యా గిరిసానుసు రంస్యతే,**
**అహం సర్వం కరిష్యామి జాగ్రతః స్వపత శ్చ తే"**

(శ్రీరామాయణం– అయోధ్యాకాండ – 31– 25)

(నీవు సీతాదేవితో కలిసి పర్వత చర్యలలో వ్యవహరిస్తావు అప్పుడు నీవు మెలకువుగా ఉన్నప్పుడు, నిద్రించేటప్పుడు కూడా నీకు అన్ని విధాలయిన సేవలను చేస్తాను) అని తెలిపాడు కదా.

భరతుడు చిత్రకూటానికి వెళ్లి, శ్రీరాముని రమ్మని అందిస్తూ శరణాగతి చేయడంకూడా అతనికి సేవ చేయడమే పరమప్రాప్యం అనే భావనతో చేశాడు. అది సిద్ధించకపోయినా, శ్రీరాముని మాటను పాలిస్తూ, రాముడు అయోధ్యకు తిరిగి వచ్చేవరకు అయోధ్యాపాలన నిర్వహించి, రాముని అభిమతాన్ని నిర్వర్తించడం – అనే కైంకర్యాన్ని చేశాడు.

శ్రీరామాయణంలో విశిష్టాద్వైతం

దండకారణ్యంలో నివసించే మహర్షులు చేసిన శరణాగతికి శ్రీరామునకు వాచికకైంకర్యం ఫలంగా లభించింది. ఈ విషయాన్ని శ్రీరామాయణం,

**"తే తం సోమ మివోద్యంతం దృష్ట్వా వై ధర్మచారిణః,
మంగళాని ప్రయుంజానాః ప్రత్యగృహ్ణన్ దృఢవ్రతాః"**

(శ్రీరామాయణం – అరణ్యకాండ –1 –11)

అని తెలిపింది.

సుగ్రీవశరణాగతికి, విభీషణ శరణాగతికికూడా ఫలం రామకైంకర్యమే. ఇదే క్రమాన్ని మిగిలిన అన్ని శరణాగతులలోను గమనించవచ్చు. విస్తరభీతివల్ల ఇంతటితో ఈ విషయం విడువబడుతున్నది.

## అర్థపంచకంలో ఇక చివరి అంశం విరోధి స్వరూపం

**విరోధిస్వరూపం**

**"ద్వ్యక్షర స్తు భవే న్మృత్యుః త్ర్యక్షరం బ్రహ్మణః పదమ్,
మమేతి ద్వ్యక్షరో మృత్యుః న మమేతి చ శాశ్వతమ్"**

(రెండక్షరాలు కలిగినది పదం మృత్యువు. మూడు అక్షరాలు కలిగిన పదం పరమాత్మకుకూడా ప్రాప్యం. "మమ" అనే రెండక్షరాలు కలిగిన పదమే మృత్యువు, "న మమ" అనే మూడు అక్షరాలు కలిగిన పదమే శాశ్వతమైన మోక్షం) అనేది శాస్త్రవచనం. "అహం, మమ" (నేను, నాది) అనే రెండు అక్షరాలు కలిగిన పదాలు మృత్యువు అని చెప్పదగిన సంసారానికి హేతువులు. "న అహమ్", "న మమ" అనే మూడు అక్షరాలు కలిగిన పదాలు

మోక్ష హేతువులు. ఈ అర్థాన్ని శ్రీలోకాచార్యులవారు అనే శ్రీవైష్ణవాచార్యులు అనువదిస్తూ, – " మః" అని అనడం స్వరూప నాశనం, "నమః " అని అనడం స్వరూపోజ్జీవనం– అన్నారు. అంటే, "మః" (నాది) అనే పదంలో అహంకారం, మమకారం – అనే రెండు భాసిస్తున్నందువల్ల, ఈ పదంలో అన్వయం కలిగి ఉండడం ఆత్మకు స్వరూప నాశనం కలిగిస్తుంది. "న మః" (నాది కాదు) అని ఆ పదంలో అన్వయం లేకుండా ఉండడం ఆత్మస్వరూపం ఉజ్జీవించడానికి కారణం అవుతుంది– అని దీని భావం. అందువల్ల, "అహం, మమ" (నేను, నాది) అనే ఈ రెండే సంసారానికి మూలం, " నాహం, న మమ" అనే ఈ రెండే చేతనోజ్జీవనానికి మూలం.

ఈ విషయాన్ని శ్రీరామాయణం యుద్ధకాండలోని 36వసర్గలో, రావణుని నోటిద్వారానే ఈ విధంగా తెలిపింది. తనకు హితాన్ని ఉపదేశించిన మాల్యవంతునితో రావణుడు సమాధానం పలుకుతూ ఈ విధంగా అన్నాడు.

**"ద్విధా భజ్యేయ మప్యేవం న నమేయం హి కస్యచిత్,**
**ఏష మే సహజో దోషః స్వభావో దురతిక్రమః" (11)**

(నన్ను రెండుగా చీల్చినప్పటికీ కూడా నేను ఎవరికీ తలవంచను. నమస్కరించను. ఇది నా సహజమైన దోషం. స్వభావం దాటరానిది కదా.)

తమోగుణమే మూర్తీభవించినవాడు రావణుడు. అందువల్ల, అతడు, ఏ దశలోనూ ఎవరి ముందు తలవంచి, నమశ్శబ్దాన్ని పలుకనివాడు. తాను చేసే పని తగనిది అని తెలిసినా, చివరకు తాను రాముని చేతిలో నశించడం తథ్యమని తెలిసినా, ఆత్మస్వరూపాన్ని ఉజ్జీవింపచేసే "నమః" అనే పదాన్ని ఉచ్చరించలేదు. రాముని శరణాగతి చేయలేదు. మూడు కరణాలలోనూ ఆ పదంతో అన్వయాన్ని పొందడానికి ఇష్టపడలేదు.

వేదాంతదేశికులు అనే ఆచార్యులు సంకల్పసూర్యోదయం అనే నాటకంలో–

**“దర్పోదగ్రదశేంద్రియాననమనోనక్తంచరాధిష్ఠితే**
**దేహే ఽ స్మిన్ భవసింధునా పరివృతే దీనాం దశా మాస్థితః,**
**అద్యత్వే హనుమత్సమేన గురుణా సందర్శితార్థః పుమాన్**
**లంకారుద్ధ విదేహరాజతనయా న్యాయేన లాలప్యతే”**

అనే ఒక అద్భుతమైన శ్లోకాన్ని అనుగ్రహించారు.

మన శరీరమే ఒక లంక, అది, సంసారసాగరం మధ్యలో ఉన్నది, ఇందులో ఒక రావణుడు ఉన్నాడు, అతడు మన మనసే. వాని లక్షణాలన్నీ మన మనసుకు ఉన్నవి. మనసు చంచలం ప్రమాది బలవంతం, దృఢం, దుర్జయం. రావణుడు చేసే వికృత కార్యాలు అన్నీ నమశ్శబ్దార్థంలో అన్వయం లేని మనసు చేసే చేష్టలే. ఈ రావణుడనే మనసుకు ఎందరో సహకారులు ఉన్నారు. కుంభకర్ణుడనే కామం, ఇంద్రజిత్తు అనే క్రోధం, అతని మాటలను విని సీతను బాధ పెట్టిన రాక్షస స్త్రీలు అనే మనసు ప్రేరణతో ప్రవర్తించే పలు ఇంద్రియ వృత్తులు. రావణుని మాటను విని రాక్షస స్త్రీలు సీతను అనేక విధాల బాధ పెట్టేటట్లే, మన ఆత్మనుకూడా మనసు ప్రేరణవల్ల ప్రవర్తించే పలు ఇంద్రియ వృత్తులు బాధపెడతాయి. సీతాదేవి ఏ విధంగా తన మనోవాక్కాయాలను శ్రీరామచంద్రునకు అర్పించి, ఆ స్వామి కృపకు పాత్రమై, ఆయన పంపిన హనుమంతుని సందేశంతో ప్రాణాన్ని నిలుపుకొని ఉండి, ఆయన ద్వారా తన ముక్తికి విరోధులైన దైత్యుల బారినుండి బయటపడి పుష్పకవిమానంలో అయోధ్యకు చేర్చబడిందో, ఆ విధంగానే, మన ఆత్మకూడా, మన మనోవాక్కాయాలను భగవంతుని అర్పించి, దృఢమైన విశ్వాసంతో ఉన్నట్లయితే, భగవంతుడు మన పట్ల కృపతో

మనకుకూడా ఆంజనేయునివంటి ఆచార్యులను కృప చేసి, మనకు మోక్ష విరోధులైన, రాక్షసుల కంటే చాలా ఘోరమైన పాపాలనుండి విడిపించి, మనలను అర్చిరాది మార్గంద్వారా విమానంలో అయోధ్య అనబడే పరమపదానికి చేరుస్తాడు.

ఈ విధంగా, శ్రీరామాయణం సంసారంలో బంధింపబడిన జీవుడు ఉద్ధరింపబడే మార్గాన్ని అందంగా వర్ణిస్తున్నది– అనే తత్వాన్ని దేశికులు పై శ్లోకంలో తెలిపారు.

## సదాచార్య సంబంధం

శ్రీవైష్ణవసంప్రదాయంలో మరొక ముఖ్యమైన అంశం ఆచార్యసంబంధం. భగవంతుడు జీవుని అనుగ్రహించడానికి సదాచార్య సంబంధాన్ని అపేక్షిస్తాడు – అని ఈ సంప్రదాయంలోని విశ్వాసం. ఈ అంశాన్నికూడా, శ్రీరామాయణం శబరీవృత్తాంతంద్వారా తెలుపబడింది.

శ్రీరాముడు జగద్భర్త. ఆ స్వామిని సీత అనే జీవుడు పొందడానికి ఘటకుడిగా ఆచార్యునకు ఎంత ప్రాధాన్యం ఉన్నదో సుందరకాండలో హనుమంతుని పాత్రద్వారా శ్రీరామాయణం నిరూపించింది. వేదంకూడా "ఆచార్యవాన్ పురుషో వేద" (సదాచార్యుని కలిగినవాడే, అంటే, సదాచార్యాభిమానాన్ని కలిగినవాడే భగవంతుని పొందగలడని తెలిపింది.

**"పాపిష్ఠః క్షత్రబంధుశ్చ పుండరీకశ్చ పుణ్యకృత్,**
**ఆచార్యవత్తయా ముక్తౌ తస్మాదాచార్యవాన్ భవేత్"**

(పాపాలను చేసినవాడైన క్షత్రబంధువు, పుణ్యాలను చేసినవాడైన పుండరీకుడు అనే ఇద్దరూకూడా ఆచార్యసంబంధంవల్ల ముక్తిని పొందారు. అందువల్ల పుణ్యం చేయడమో, పాపం చేయడమో మోక్షానికి కారణం కాదు

సదాచాచార్య సంబంధమే మోక్షాన్ని కలిగిస్తుంది) అనే ఇంకొక ప్రమాణం దీనిని బలపరుస్తున్నది. ఈ ప్రమాణాల అర్థమే సుందరకాండలో శ్రీరామాయణం నిరూపిస్తున్నది.

వేరొక ఆశ్చర్యకరమైన అంశం ఇక్కడ ఏమంటే, శ్రీవైష్ణవ సంప్రదాయంలో మరణించినవారిని, మరణించారు అని కానీ, పరమపదం చేరారు అని కానీ అనరు. "స్వాచార్యపాదసన్నిధిని చేరారు " అని చెప్పబడుతున్నది. ఈ సత్సంప్రదాయానికి మూలం శ్రీరామాయణంలో శబరి పలికిన

**"పాదమూలం గమిష్యామి యానహం పర్యచారిషమ్"**

(శ్రీరామా! నేను, ఇంత కాలంగా నేను సేవించిన నా ఆచార్యుల పాద సన్నిధిని చేరుతాను) అనే సూక్తియే.

ఈ విధంగా, శ్రీరామాయణాన్ని అవలోకించి చూస్తే, సర్వత్ర విశిష్టాద్వైతసిద్ధాంత సంప్రదాయార్థాలు ఎన్నో ప్రకాశిస్తున్నాయి. ఈ వ్యాసాన్ని ముగించడానికి ముందుగా మరి ఒకటి రెండు అంశాలను ప్రసావించడం జరుగుతున్నది.

భగవానుడు ప్రణవప్రతిపాద్యుడు. అకారంచేత చెప్పబడే శ్రీమన్నారాయణనకు మాత్రమేమాత్రమే మకారంచేత నిర్దేశింపబడే జీవుడు శేషభూతుడు– అనే అర్థాన్ని ప్రణవం ప్రతిపాదిస్తున్నది – అనేది భగవద్రామానుజసంప్రదాయతత్త్వం. దీనిని శ్రీరామాయణం లక్ష్మణచరిత్రద్వారా తెలియజేస్తున్నది.

ప్రణవస్వరూపాన్నికూడా శ్రీరామాయణం మనకు దర్శింప చేస్తున్నది. శ్రీరామసీతాలక్ష్మణులు ముగ్గురు వనానికి వెళ్లే సందర్భాన్ని వాల్మీకి మహర్షి వర్ణిస్తూ,

**"అగ్రతః ప్రయయౌ రామః సీతా మధ్యే సుమధ్యమా,**
**పృష్ఠత స్తు ధనుష్పాణిః లక్ష్మణో ౨ నుజగామ హ"**

(ముందు శ్రీరాముడు వెళ్లాడు. చక్కని నడుమును కలిగిన సీతాదేవి మధ్యలో వెళ్ళింది. వారిద్దరిని, విల్లును పట్టిన లక్ష్మణుడు అనుసరించాడు) అని పలికిన శ్లోకం ప్రణవ స్వరూపాన్ని దర్శింప చేస్తున్నదని గోవిందరాజీయ వ్యాఖ్యానం తెలుపుతున్నది.

ప్రణవంలో ముందు భగవంతుని నిర్దేశించే అకారం, ఆ తరువాత లక్ష్మీదేవిని నిర్దేశించే ఉకారం, చివరిలో జీవవాచకమైన మకారం ఉన్నాయి. పాంచరాత్రశాస్త్రంలో ఉకారం లక్ష్మీవాచకంగా ప్రసిద్ధి ఉన్నది. పైన ఉదాహరించిన శ్రీరామాయణ శ్లోకాన్ని గమనిస్తే, వనవాసానికి వెళ్లేటప్పుడు, అకారంచేత చెప్పబడే భగవానుడైన శ్రీరాముడు ముందు, ఉకారంచేత నిర్దేశింపబడే లక్ష్మీస్వరూపిణి అయిన సీతాదేవి మధ్యలో, ఆకారంచేత నిర్దేశింపబడే జీవస్థానీయుడైన లక్ష్మణుడు చివరిలో వెళ్లినందున, ఆ సన్నివేశం ప్రణవం కదలి వెడుతున్నట్లుగా ఉన్నదని భావించి, వాల్మీకి మహర్షి ఆశ్చర్యానందాలతో "హ" అని అన్నాడని వ్యాఖ్యానింపబడింది. ఇందువల్ల ఈ సన్నివేశం ప్రణవ స్వరూపాన్ని దర్శింప చేస్తున్నది.

ప్రణవప్రతిపాద్యుడు భగవానుడనే విషయాన్ని శివధనుర్భంగ ఘట్టం సూచిస్తున్నది. ఉపనిషత్తు "ప్రణవో ధనుః" అంటూ ప్రణవాన్ని ధనుస్సుగా రూపించి పలికింది. ఎవరికి వంచడానికి సాధ్యం కాని శివధనుస్సు భగవత్స్వరూపుడయిన శ్రీరామునకు వంగడం వంచడం అనేది ప్రణవం భగవంతుని ప్రతిపాదిస్తున్నదనే తత్త్వానికి సూచకం.

శ్రీరామాయణంలో విశిష్టాద్వైతం

## అష్టాక్షరీ మంత్రార్థంవివరణం

సుబాలోపనిషత్తు "మాతా పితా భ్రాతా నివాసః శరణం సుహృద్గతిః నారాయణః" (నారాయణుడు – తల్లి, తండ్రి, సోదరుడు, నివాసం, శరణం, స్నేహితుడు, గతి) అని అంటూ భగవానుడు జీవులకు సర్వవిధ బంధువు అని తెలిపింది. ఈ అర్థాన్ని శ్రీరామాయణంకూడా తెలుపుతున్నది.

శ్రీరామానుజసంప్రదాయంలో మంత్రరాజంగా అష్టాక్షరీమహామంత్రం సంభావింపబడుతున్నది. ఇది, భగవంతునకు జీవునకు మధ్య ఉండే 9 విధాలైన సంబంధాలను తెలుపుతున్నది – అని ఈ సంప్రదాయంలో భావింపబడుతున్నది. ఈ విషయాన్నిగూర్చి శ్రీలోకాచార్యులు అనే శ్రీవైష్ణవాచార్యులు నవవిధసంబంధం అనే గ్రంథాన్నికూడా రచించారుకూడా.

**"పితా చ రక్షకః శేషీ భర్తా జ్ఞేయో రమాపతిః,**
**స్వామ్యాధారో మమాత్మా చ భోక్తా చాద్యమనూదితః"**

అనే శ్లోకంలో ఈ తొమ్మిది సంబంధాలు తెలుపబడ్డాయి. వీటి వివరం ఏమంటే, అష్టాక్షరిలో ముందు ప్రణవం ఉన్నది. ఈ ప్రణవంలోని మొదటి అక్షరమైన కారం ద్వారా భగవానుడు తండ్రి, రక్షకుడు అని తెలుపడుతున్నది. ఈ అకారంపై వచ్చి లోపించిన చతుర్థీవిభక్తిద్వారా శేషి అని చెప్పబడుతున్నది. ప్రణవంలోని రెండవ అక్షరం అయిన ఉకారం ద్వారా భగవానుడే అందరికీ భర్త అని తెలుపబడుతున్నది. మూడవ అక్షరమైన మకారంద్వారా భగవానుడు జ్ఞేయుడు అని చెప్పబడుతున్నది. ఇక అష్టాక్షరిలోని రెండవ పదం అయిన నమస్సుద్వారా భగవానుడే సర్వస్వామి అని చెప్పబడుతున్నది. " నారాయణాయ " అనే మూడవ పదంద్వారా భగవానుడు అందరికీ ఆధారం, ఆత్మ, భోక్త చెప్పబడుతున్నది ఈ విధంగా

అష్టాక్షరిలో 9 విధాలైన సంబంధాలు భగవంతునకు జీవునకు మధ్య తెలుపబడుతున్నాయని భగవద్రామానుజ సంప్రదాయంలో భావింపబడుతున్నది.

ఇటువంటి సంబంధాలను శ్రీరాముని విషయంగా లక్ష్మణుడు అనుసంధించిన వైనం శ్రీరామాయణంలో మనకు గోచరిస్తుంది. అతడు పలికిన,

**"అహం తావన్మహారాజే పితృత్వం నోపలక్షయే,**
**భ్రాతా భర్తా చ బంధుశ్చ పితా చ మమ రాఘవః"**

(శ్రీరామాయణం –అయోధ్యాకాండ– 58– 31)

(నేను మహారాజు అయిన దశథునిలో పితృత్వాన్ని గమనించడం లేదు. ఎందుకంటే, నాకు సోదరుడు, భర్త బంధువు, తండ్రి, ఇంకా అందరూ నాకు శ్రీరాముడే కనుక) అనే సూక్తిలో తెలుపబడింది. ఇక్కడ శ్లోకంలో ఏవో కొన్ని సంబంధాలు మాత్రమే చెప్పబడినప్పటికీ చివరిలో ఉండే, అనుక్తసముచ్చాయకమైన చకారంద్వారా సర్వవిధ సంబంధాలను లక్ష్మణుడు శ్రీరామునిలో దర్శించాడని తాత్పర్యం.

## శరణ్యదేశప్రాప్తి ముక్తిసాధనం

ఏ విధమైన ఉపాయాన్ని ఆచరించకపోయినప్పటికీ, అయోధ్యానగరంలోని చరాచరాలను అన్నిటిని, శ్రీరాముడు, తాను వైకుంఠాన్ని చేరేటప్పుడు తనతో పాటు తీసికొనివెళ్ళిడని రామాయణం తెలుపుతున్నది. దీనికి కారణం శరణ్యదేశనివాసమే. భగవానుడు అభిమానించి నిలచి ఉన్న దివ్యక్షేత్రాలలో నివసిస్తే చాలు, అదే భగవానుని

కరుణను పొందడానికి హేతువు అవుతుంది– అనే విషయం దీనివల్ల తెలుపబడింది.

ఈ రీతిలో, ఇంకా ఎన్నో పలు భగవద్రామానుజ సంప్రదాయానికి సిద్ధాంతానికి సంబంధించిన విషయయాలు శ్రీరామాయణంలో గోచరిస్తున్నప్పటికీ, ఈ వ్యాసం ఇప్పటికే విస్తరించినందు వల్ల, ఇంతటితో విరమించబడుతున్నది. స్వస్తి.

★★★★★